# మెడికల్ గైడ్

ఇంగ్లీష్ మందులతో

డా॥ K. V. N. D. ప్ర...

D.H.M.S., ...

చెరుకుపల్లి-522 309.



☎ 08644-23037




జనప్రియ పబ్లికేషన్స్.

అగ్నికుల క్షత్రియ ...

గంగానమ్మపేట, తెనాలి-522 201

# MEDICAL GUIDE

By : Dr. K. V. N. D. Prasad,

D.H.M.S., M.H.S. (London)

| ముద్రణ : జూలై, 1998. | Edition : July, 1998. |
| --- | --- |
| అన్ని హక్కులు : జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by : Janapriya Publications-Tenali. |
| వెల : రూ॥ 13-00. | Price : Rs. 13-00. |
| ముఖ చిత్రము : ఎల్. రమేష్‌బాబు, విజయవాడ-2. | Cover Design : L. Ramesh Babu, Vijayawada-2. |
| ముద్రణ : వెంకట సత్య ప్రింటర్స్, విజయవాడ-3. | Printed at : Venkata Satya Printers, Vijayawada-3. |
| ముఖచిత్ర ముద్రణ : దేవి ఆఫ్‌సెట్, విజయవాడ-2. | Cover Printers : Devi Offset, Vijayawada-2. |

ప్రతులకు : Phone : (08644) 23037, 22392 For Copies :

Janapriya Publications,

Agnikula Kshatriyula vari Street-II,

Ganganamma Pet, T E N A L I-522 201

# విషయ సూచిక (CONTENTS)

# చిన్న మనవి...!

"ఆరోగ్యమే మహాభాగ్యము" అన్నారు పెద్దలు! ఆలోచిస్తే.... మానవ జీవితమునకు- ఐహిక భోగభాగ్యాలెన్ని ఉన్నప్పటికీ.... ఆరోగ్యము సరిగా లేకపోతే.... తీరని కొఱతగానే ఉంటుంది. అందుకే.... పురాతన కాలమునుండి నేటివరకు– ఆరోగ్యపరిరక్షణకై అనేక పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. ఆనాటి కాలములో ఆయుర్వేదము మహోన్నత స్థితిలో వెలుగొందితే....ఈనాడు 'అల్లోపతి వైద్యవిధానము' అంతకంటే అధికమైన స్థానములో అలరారుతున్నది.

వర్తమాన కాలములో- ఇంగ్లీష్ వైద్య విధానము సామాన్యులకు కూడా అందుబాటులో ఉంది, వివిధ రూపములలో తయారు కాబడే ఔషధ సముదాయములు- రోగనిర్మూలనకు, ఆరోగ్యాభివృద్ధికి ఎంతగానో తోడ్పడుచున్నవి. ఐతే....వ్యాధులు కూడా క్రొంగ్రొత్త విధానములతో రూపొందుతూ.... వైద్యశాస్త్ర విజ్ఞానమునకు సవాల్‌గా నిలుస్తున్నవి. ఇట్టి తరుణములో.... "రోగోత్పత్తి ఎలా జరుగుతుంది? అనారోగ్యమునకు గురికాబడే పరిస్థితులు ఏ విధముగా ఉంటవి? రోగలక్షణములను గుర్తించడమెలా? ప్రారంభములో వివిధ రోగములకు సంబంధించి తీసికోవలసిన జాగ్రత్తలు ఏమిటి? ఆయారోగలక్షణములకు స్వీకరించవలసిన మందులు ఏమిటి?" అనే విషయములను ప్రతివారూ తెలిసికోవలసిన అవసరమున్నది.

"సామాన్య ప్రజలకు కనీస వైద్య విజ్ఞానమును అందించాలనే అభిలాషతోనే ఈ "మెడికల్ గైడ్" అను పుస్తకమును ప్రచురించి, మీ ముందుకు వస్తున్నాము. ముఖ్యముగా ఈ గ్రంథ రచయిత డా॥ K.V.N.D. ప్రసాద్, D.H.M.S., M.H.S. (London) గారు "సర్వజనావళికి అందుబాటులో ఉన్నద"నే భావముతో 'అల్లోపతి'ని గూర్చి తెలియజేసినందుకు మా కృతజ్ఞతలు! ఈ 'మెడికల్ గైడ్' సర్వజనోపయోగము కాగలదని ఆశిస్తూ....అఖిలాంధ్ర పాఠక మహాశయులకు వినయపూర్వక అభినందనముల నందజేస్తూ ..... మీ........

—Y. V. RAO
(ప్రచురణ కర్త)

# మెడికల్ గైడ్

"PREVENTION IS BETTER THAN CURE"

అంటే.... "అనారోగ్యము సంభవించిన తరువాత ట్రీట్‌మెంట్ తీసికొనేకన్నా.... అసలు వ్యాధులే రాకుండా ముందే జాగ్రత్త పడుట ఎంతో మంచి పద్ధతి" అని అర్థము! కానీ దురదృష్టవశాత్తు మన దేశములో ఈ పద్ధతి ననుసరించే వారు చాల తక్కువమంది ఉన్నారు. దీనికి కారణము "అవిద్య, పేదరికమే"నని చెప్పవచ్చును.

## వ్యాధులు రాకుండా తీసికోవలసిన జాగ్రత్తలు

వ్యాధులు అసలు రాకుండా ముందునుండి జాగ్రత్తలు తీసికోవలసిన అవసరము మనకు ఎంతైనా ఉన్నది. "అది సాధ్యమేనా?" అనే అనుమానము సామాన్యముగా చాలమందికి కలుగుతూ ఉంటుంది. కాని.... అటువంటి మార్గాలు చాల ఉన్నాయి. వాటిని నిర్దిష్టముగా ఆచరించే వారికి 'వ్యాధులు' దూరముగా ఉంటాయి. 'వ్యాధి నిరోధక క్రియ' లను వైద్యుని పర్యవేక్షణలో శిశువు జన్మించిన నాటినుండే.... దఫాల వారిగా.... ఈ క్రింద తెలిపిన విధముగా ఆచరించుట ఎంతో అత్యవసరము! ఇంకా కచ్చితముగా చెప్పాలంటే– 'పిండోత్పత్తి' జరిగిన నాటి నుండే- గర్భిణీ స్త్రీలు అనుభవజ్ఞులైన వైద్యుని సంప్రదించి వారు చెప్పినట్లుగా సరైన మందులు వాడితే ఆరోగ్యవంతమైన పాపలు జన్మిస్తారు.

### గర్భము ధరించిన స్త్రీలు-తీసికోవలసిన జాగ్రత్తలు

మొదటిసారిగా 20వ వారములో టెటనస్ టాక్సాయిడ్
రెండవసారిగా 25వ వారములో " "
మూడవసారిగా 30-32 వారాలలో " "

పై విధముగా గర్భిణీ స్త్రీలు ఇంజక్షన్స్ చేయించుకోవాలి.

### పుట్టిన పిల్లలకు వ్యాధి నిరోధక జాగ్రత్తలు

పిల్లలు పుట్టిన నెలలోపే క్షయ రాకుండా- B.C G. ఇంజక్షన్;

3వ నెలనుండి 6వ నెలలోపులో కోరింతదగ్గు (Wooping cough), కంఠసర్పి (Diphtheria), ధనుర్వాతము (Tetanus)లు రాకుండా D.P.T. ఇంజక్షన్‌ను 4 నుండి 6 వారాల తేడాలో 3 పర్యాయములు వేయించాలి. D.P.T. 3వ డోస్ వేయించిన తరువాత సంవత్సరానికి 'బూస్టర్ డోస్'గా ఒకసారి వేయించాలి. పై విధముగానే 3వ నెలలో 'పోలియో' రాకుండ 'పోలియో డ్రాప్స్' కూడా 4 నుండి 6 వారాల తేడాలో 5 డోస్‌లు వేయించాలి. తరువాత పోలియో డ్రాప్స్‌ను 'బూస్టర్ డోస్'గా 3వ సం॥లో 1 పర్యాయము, 5వ సం॥లో 1 పర్యాయము వేయించవలసి ఉంటుంది. ఐదో సంవత్సరము నుండి- ఆరవ సంవత్సరము లోపలలో D.P.T. బూస్టర్‌డోస్ మరియు టైఫాయిడ్ రాకుండా ఒక నెల వ్యవధిలో రెండుసార్లు టైఫాయిడ్ వాక్సిన్ వేయించాలి. పది సంవత్సరముల వయస్సు వచ్చిన తరువాత టెటనస్‌– టాక్సాయిడ్, టైఫాయిడ్ వాక్సిన్స్ వేయించాలి. పదిహేను సంవత్సరములనుండి పద హారేళ్ళప్రాయము ప్రవేశించినప్పుడు మరల టెటనస్, టాక్సాయిడ్, టైఫాయిడ్ వాక్సిన్‌లతో వ్యాధి నిరోధక చర్యలలోని అంకము పూర్తి ఔతుంది. ఐతే.... పైన చెప్పినవన్నీ అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్ష ణలో బిడ్డకు ఒక సంవత్సరము పూర్తి అయ్యేలోపు ఆరోగ్యాన్ని బట్టి ప్రధానమైన అంటువ్యాధుల నుండి రక్షణ కల్పించాలి. పైన చెప్పబడిన కాలములో ఆయా వాక్సిన్‌లను మీ పిల్లలకు వాడితే ... ముందు ముందు "అనారోగ్యము" అనే పదాన్నే తుడిచిపెట్టవచ్చును. వ్యాధి నిరోధక మందులను పిల్లలకు ఇచ్చే సమయములో– జలుబు, దగ్గు, వాంతులు, విరేచనాలు, జ్వరము లాంటివి లేకుండా చూచుకోవాలి.

## పిల్లల వ్యాధులు - నివారణ

పిల్లలకు సహజముగా వ్యాధి నిరోధక శక్తి చాల తక్కువగా ఉంటుంది. కాబట్టి ... వారిని "కంటికి రెప్పలా కాపాడుకోవలసిన బాధ్యత తమదే"నని ప్రతి తల్లిదండ్రులు తప్పనిసరిగా గ్రహించాలి.

మనలో చాలామంది- పిల్లలు పుట్టగానే కొన్ని నెలల వరకు వాటికి ఆముదము త్రాగిస్తారు. ఈ పద్ధతి వలన పిల్లలకు సహజముగా వుండే జీర్ణశక్తి తగ్గిపోయి, ఆముదము త్రాగితేగాని 'విరేచనము' కాని పరిస్థితి ఏర్పడుతుంది. పిల్లలకు జీర్ణశక్తి సరిగా లేనప్పుడు వైద్యుని సంప్రదించి వారి సలహాలను పొందుట మంచిది.

## పిల్లలను గురించి పెద్దలు తీసికోవలసిన జాగ్రత్తలు

అతి శీతలముగాని, అతి ఉష్ణముగాని పిల్లలకు పడదు. కారణము మెదడునందు వారికి వేడిమిని నిర్దేశించే స్థానము ఈ చిన్న వయస్సులో సమకూరదు దీనివలన పిల్లలు అధిక ఉష్ణ– శీతలాలను తట్టుకోలేరు.

ఏ కారణమువలనైనా తీవ్రవస్థాయిలో జ్వరమువస్తే.... శిశువులు భరించలేరు. శరీరమంతా మెలికలు వస్తాయి. దీన్నే "Febril Con vulsions" అని అంటారు. అందుకోసమే టైఫాయిడ్ వంటి జ్వరములు దరి జేరకుండా "T. A. B." అనే Vaccine ఇస్తారు వైద్యులు! ఇలాంటి తీవ్ర జ్వరాలలో- ఒక గుడ్డను చల్లని నీటిలో తడిపి, దానిని శిశువు దేహమంతా కప్పి, విసనకర్రతో విసురుతూ ఉండాలి. సమయానుకూలముగా యాంటిబయాటిక్స్ మందులను- అతి మెలకువగా సెలక్ట్ చేయాలి. యాంటిబయాటిక్స్‌ను సరిగా సెలక్ట్ చేయకపోతే.... ఒక్కొక్కసారి వికటించే పరిస్థితి వస్తుంది. ఉదాహరణకు టెట్రాసైక్లిన్ పడక కొందరికి నోటిలో తెల్లటి పొర ఏర్పడ వచ్చును. అప్పుడప్పుడు ఇది ఏ మందు ఇవ్వకుండా కూడా రావచ్చును. దీనిని "త్రష్ (Trush)" అని వైద్య పరిభాషలో వాడుతుంటారు. యిది వచ్చినప్పుడు 1% Gentianviolet పూత మందును ఇస్తారు- వైద్యులు! కొన్ని ప్రత్యేకమైన కేసులలో సర్వసాధారణముగా వాడే యాంటిబయాటిక్స్ అంటే పెనిసిలిన్ (Penicillin), టెట్రాసైక్లిన్ లాంటి కొన్ని మందులకు వ్యాధిని కలిగించే సూక్ష్మక్రిములు లొంగవు. అలాగే క్లోరమ్ ఫెనికాల్ (Chloram Phenicol) లాంటివి దీర్ఘకాలమువాడితే.... రక్తములోని తెల్లకణాలు తగ్గిపోయే ప్రమాదము ఏర్పడుతుంది. అందుకోసమే

"అల్లోపతి" మందులు వదేవారు- అతి జాగ్రత్తగా సరిపోయే మందును ఎన్నుకోవాలి. నియమానుసారముగా సరైన మోతాదులో వైద్యులు చెప్పినట్లుగా ఉపయోగించాలి. కొన్ని యాంటీబయాటిక్స్: 1] బాక్టీరియా (Bacteria) 2] టెట్రాసైక్లిన్ (Tetracycline), ఇవి చంటి పిల్లల కైతే డ్రాప్స్ (Drops); చిన్న పిల్లలకైతే సిరప్ లేక బిళ్ళలుగా చాల జాగ్రత్తగా వాడాలి.

## చిన్న పిల్లలకు వేయవలసిన మందు మోతాదులు

చిన్న పిల్లలకు మందు ఇచ్చునప్పుడు డోస్‌ను సరిగా నిర్ణ యించాలి. ఎన్ని గంటలకు ఔషధము ఇవ్వాలో కూడా తెలిసికోవాలి. మందుయొక్క పరిమాణము నిర్ణయించుట అనేది....పిల్లల వయస్సు, బరువుల పరిమాణమునుబట్టి ఉంటుంది.

3 నెలల నుండి 12 నెలల పిల్లలకు- పెద్దవాళ్ళ ఇచ్చే మోతా దులో పన్నెండున్నర శాతము (12 1/2%) నుండి ఇరవై శాతము (20%) వరకు ఇవ్వవచ్చును. అనగా.... పెద్దలు వేసికొనే ఒక బిళ్ళను- 5 నుండి 8 భాగాలుగా చేసి, ఒక భాగము మాత్రమే ఇవ్వాలి. 7 సంవ త్సరాలలోపు పిల్లలకైతే ఇరవై ఐదు శాతము (25%) అంటే పెద్దల కిచ్చే బిళ్ళని 4 భాగాలుగా విభజించి ఒక భాగము ఇవ్వాలి. 12 సంవ త్సరాలలోపు పిల్లలకైతే డెబ్బై ఐదు శాతము (75%) అంటే.... ఒక బిళ్ళను నాలుగు భాగాలుచేసి 3 భాగాలు ఇవ్వాలి.

మరీ పసికందులకు అంటే....నెలలోపు (Neonatal Period) బేబీలకు చుక్కల మందులు ఇచ్చుట చాల మంచిది తరువాత గూడా సిరప్ రూపములోగాని; బిళ్ళలైతే పొడిచేసి- తేనెలోనో, జామ్‌లోనో కలిపిగానీ ఇస్తే....పిల్లలు ఇష్టముగా తీసికొంటారు.

పుట్టినప్పుడు శిశువుబరువు 2 1/2 కేజీలకన్నా తక్కువ (5 1/2 Lbs) ఉన్నవారిని "Premature Babies" అంటారు. ఇలాంటి పిల్లల విషయములో అత్యంత శ్రద్ధగా, జాగ్రత్తగా ఉండి; అవసర సమయములో వైద్యుల పర్యవేక్షణలో ఉంచి, బేబీని రక్షించాలి. అభి వృద్ధి పొందిన కొన్ని దేశాలలో ఇలాంటి పిల్లలకు అన్ని విధము

లైన పరికరములతో కూడుకొన్న వైద్య సౌకర్యములు కలిపించు, ఉష్ణోగ్రతను కావలసిన మోతాదులో సమకూర్చి, సక్రమమైన ఆహారము ఇస్తూ వ్యాధులు రాకుండా కాపాడతారు.

పుట్టిన ప్రతిబిడ్డకూ తల్లిపాలు ఎంతో అవసరము! ఇవి పిల్లలకు ఎంతో మేలుచేసి, వ్యాధి నిరోధక కారణమౌతాయి. ఏదైనా అవాంతర కారణాలవలన బిడ్డకు తల్లిపాలు లభ్యముకానిచో- రెండు నెలల వఱకు Half Greem Milk (Oster Milk–1) ఇవ్వవలెను.

చిన్న పిల్లలకు తఱచుగా విరేచనాలు, వాంతులు ఔతుంటాయి. అటువంటి సమయములో పోతపాలు ఆపుచేసి, నియమానుసారముగా 'Half Normal Saline' పట్టించాలి. పిల్లలకు-కళ్ళు లోతుకు పీక్కుని పోయి, నీరసముగా, డీలాపడిపోయి ఉంటే.... దీనిని "డీ-హైడ్రేషన్ (De-hydration)" అంటారు. 'Subcutaneous (క్రింది చర్మము)' లోనికిగానీ, రక్తనాళములలోనికిగానీ అంచనా మేరకు Fluids (ద్రవములు, గ్లూకోజ్ మొ॥నవి) ఇస్తూ.... అవసరమును బట్టి మలములో దోషమున్నదేమోనని కూడా పరీక్షించి తగిన మందులు వాడవలెను. పరీక్షించే సౌకర్యము అలస్యమయ్యే సందర్భాలలో.... పరీక్ష జరిగే వఱకు తాత్కాలికముగా 'Neomycin' వంటి యాంటీబయాటిక్స్‌ని ఇస్తే మంచిది. ఒకోసారి Broad spectrumని వాడవలసి ఉంటుంది. కలరా వంటి లక్షణాలు కనిపిస్తే చాల కష్టము! అందుకే కలరా రాకుండా, ముఖ్యముగా అది ప్రబలముగా ఉన్న సమయాలలో (ఉత్సవాలు, తిరునాళ్ళు మొ॥లగు వాటికెళ్ళేటప్పుడు Inoculations టీకాలు (సూది మందు) వేయించుట ఎంతైనా అవసరము.

పిల్లలకు సాధ్యమైనంత త్వరితముగా (బిడ్డ పుట్టగానే అయినా సరే.... B.C.G. Vaccination వేయించాలి. ఇలా చేసినందువలన పిల్లలకు సర్వ విధములైన క్షయ వ్యాధులు అరికట్టబడి.... హాయిగా వుంటారు.

పాలు త్రాగే ప్రాయములో పిల్లలు చాల మృదువుగా, లాలిత్యముగా ఉండి; చూసేవారికి హృదయము స్పందించి– ముద్దులు కురిపిస్తారు. ఆ ప్రాయములో వారు మనకెంత ముద్దు వస్తారో....

వ్యాధులకు కూడా అంతే ముద్దు! కారణము ఆ లేత్రాయములో వారికి వ్యాధి నిరోధకశక్తి చాల తక్కువగా వుంటుంది. ఎవరిని పడితే వారిని మొగమాటమునకుపోయి బిడ్డలను ముద్దుచేయనీయరాదు. ఆ ముద్దుల వలన వ్యాధి కలిగించే క్రిములు బిడ్డను చేరి, కొన్ని సమయాలలో మన చేయి దాటిపోయి....మృత్యువు ముద్దుకే చేర్చవలసి రావచ్చును. ఈ విషయములో ప్రతి తల్లి-తండ్రులు ఎంతో జాగ్రత్త వహించి తమ బిడ్డల ఆరోగ్యాన్ని కాపాడుకోవాలి.

## పిల్లలకు తఱచుగా వచ్చు వ్యాధులు - నివారణ

### పోలియో

పిల్లలకు ముఖ్యముగా వచ్చే వ్యాధులలో Poliomyelitis ఎన్న దగినది. ఈ జబ్బు ఉమ్మి తుంపరల ద్వారాగాని, Faecal Con amination (మల-మూత్రముల అంటు) వలనగాని వస్తుంది. కొన్ని సమయాలలో ఈ వ్యాధిసోకినా....మనకు తెలియనంత తక్కువ మోతాదులో వచ్చి తగ్గిపోతుంది. ఈ వ్యాధివలన పిల్లలు నలతగా ఉండి జ్వరము, విరేచనములకు లోనై....కొన్నిరోజులకు కాలో- చేయో చచ్చుబడిపోతుంది ఒక్కొసారి ఈ వ్యాధి విశ్వరూపము ధరించి, దేహమంతా ప్రాకి-శ్వాసావ యవములు, శ్వాస కేంద్రీయ స్థానము చచ్చుబడిపోయి.... ప్రాణాలనే హరించవచ్చును. కొబట్టి.... చిన్న పిల్లలకు జ్వరము, విరేచనములు ఉన్నపుడు.... డాక్టర్ పర్యవేక్షణ లేకుండా ఉండకూడదు. బిడ్డలను ఆ వ్యాధినుండి కాపాడుటకు 5 సార్లుగా.... 3, 4, 5, 6, 7 నెలలలో తప్పని సరిగా పోలియోడ్రాప్స్ వేయించాలి.

### కోరింత దగ్గు

"Whooping Cough (Pertussis)" : తదుపరి స్థాయిలో చెప్పుకోదగిన వ్యాధి కోరింతదగ్గు! ఇది చిన్న పిల్లలలో.... అందులోనూ ఆడపిల్లలకి ఇది ఎక్కువగా రావచ్చును. 10 సం॥ల వయసు తరువాత సహజముగా ఇది చాల తక్కువగా కనిపిస్తుంది. ఈ వ్యాధి సోకిన తరువాత 7 నుండి 14 రోజులలో దీని లక్షణములు కనిపించవచ్చును.

ఈ వ్యాధి క్రిములు కూడా ఉమ్మి తుంపరల ద్వారానే సంక్రమిస్తాయి. సర్వసామాన్యముగా పిల్లలకు ఇది "Hacmophilus pertussis" అనే క్రిములవలన వస్తుంది. మొదట జ్వరముగాను, భారమైన రొంపగాను మొదలౌతుంది. ఒక వారము లోపులో.... తెరలు తెరలుగా దగ్గు వచ్చి, ముఖమంతా ఎండిపోయి, తఱచుగా వాంతులు ఔతుంటాయి. పసిపిల్లలు ఈ వ్యాధికి తట్టుకొనుట చాల కష్టము! ఈ జబ్బుకు 'టెట్రాసైక్లిన్' అనే మందును జాగ్రత్తగా వాడాలి.

## కంఠసర్పి (Diphtheria)

ఈ వ్యాధి కూడా సూక్ష్మక్రిములు గల ఉమ్మి తుంపరల ద్వారా వ్యాపిస్తుంది. ఈ క్రిములు మూడు రకములు! అవి : 1) Gravis, 2) Intermedius, 3) Mitis వ్యాధి తీవ్రత ముఖ్యముగా "వ్యాధిగ్రస్తుని శరీరస్థితి, వచ్చిన ప్రదేశము, ఎంతకాలము నుండి వ్యాధి వున్నది" అను వాటిపై ఆధారపడి వుంటుంది. ఈ వ్యాధి వచ్చిన 26 రోజులకు దీని లక్షణములు కనిపించును.

## వ్యాధి రకములు

(A) 1) గొంతులో టాన్సిల్స్‌కి ఇన్‌ఫెక్షన్ రావచ్చు దీనితో రోగికి జ్వరము, గొంతునొప్పి, గొంతు వాపు కూడా ఉండవచ్చు. 2) గొంతులోని గాలి గొట్టము (Larynx) లలో రావచ్చు. దీని మూలముగా మొదట గొంతు బొంగురుపోయి, శ్వాస పీల్చేటపుడు అడ్డుపడినట్లుగా వుంటుంది. వైద్యము వెంటనే జరుగనిచో శ్వాసకోశమునకు ఆ పొర అడ్డుపడి ప్రాణమునకే ప్రమాదము రావచ్చు. 3) ముక్కులో (Nasal diphtheria) అంగుళి పైన వచ్చు రకము!

ఈ పై మూడు రకముల వలన శ్వాసకోశమునకు అడ్డుపడి ప్రమాదము రావచ్చు.

(B) పై విధములుగా గాక.... చెవులలోగాని, కంటిపొరలో గాని, నాలుకకుగాని diphtheria రావచ్చు. ఇలా జరిగినపుడు- వైద్యులకు చూపించి, చిన్న ముక్క తీయించి పరీక్ష చేసి మందులు వాడవలెను.

## కంఠసర్పి లక్షణములు

గొంతులో తెల్లని పొరలా ఏర్పడి, ఊపిరి ఆడదు ఒక్కోసారి నరములు చచ్చుపడిపోవచ్చు! గుండె ఆగిపోవచ్చు!! శ్వాసక్రియ జరుగక పోవచ్చు. ఈ వ్యాధి వచ్చిన వారిని- వేఱే వుంచి వైద్యము చేయవలెను. లేనిచో.... అంటువ్యాధి కాబట్టి.... మిగిలిన పిల్లలకు రావచ్చు. వ్యాధి తీవ్రతనుబట్టి పెనిసిలిన్ లేదా మరొక ఔషధమును వాడవలసి వుంటుంది. శ్వాసనాళమునకు పొర అడ్డుపడినచో.... అక్కడ "రంధ్ర శస్త్రచికిత్స (Tracheotomy)" చేయవలసి వుంటుంది.

## ధనుర్వాతము (TETANUS)

ఇది "Clostridium Tetani" అనే క్రిమివలన వస్తుంది. ధనుర్వాతము వచ్చినపుడు మెదడు, ముఖ్యముగా వెన్నుపాము దెబ్బతింటవి!

1) గాయాలు, దెబ్బలవలన; 2) చెవిలో ఎక్కువగా చీము కారుట వలన; 3) బాలింతలకు, పసిపిల్లలకు బొడ్డు శుభ్రముగా ఉంచక పోవుట వలన; 4) కొన్ని సందర్భాలలో ఆపరేషన్ తరువాత ధనుర్వాతము రావచ్చు..

వ్యాధి మొదలైన 7-8 రోజులలో దీని లక్షణములు కనిపించును. దవడ కండరములు బిగిసికొనుట మొదటి గుర్తు! ఆ తరువాత మెడ కండరములు, ఆపైన శరీరములోని మొత్తము కండరములు బిగిసికొంటూ వణుకు రావచ్చు! ఊపిరితిత్తుల కండరములు సరిగా పనిచేయక పోవుటచే.... ప్రాణాపాయము ఏర్పడవచ్చు. ఈ వ్యాధి వచ్చిన రోగిని.... వెలుతురులేని చీకటి గదిలో వుంచి, Sedatives, A. T. S. ఇస్తూ ఉండాలి. ఈ మందులు వయసునుబట్టి, వ్యాధి తీవ్రతనుబట్టి జాగ్రత్తగా వాడుతుండాలి.

పైన ఉదహరించిన మూడు వ్యాధులు (కోరింతదగ్గు, కంఠసర్పి, ధనుర్వాతము) రాకుండా ట్రిపుల్ యాంటిజెన్ "Triple Antigen (D.P.T.)" వాక్సిన్‌లను- పుట్టిన 3, 4 మరియు 5 నెలలలో వేయించి; తరువాత సంవత్సరమునకు ఒకసారి, 5 సంవత్సరములకు ఒకసారి 'బూస్టర్ డోస్'గా వేయిస్తే.... ఈ వ్యాధులు రాకుండా ముందే రక్షణ కల్పించిన వారమౌతాము.

# వైరస్ వలన కలుగు అంటువ్యాధులు

[i) Measles, ii) Mumps iii) Chicken-pox]

## MEASLES (తట్టు)

ఈ వ్యాధి సోకిన తరువాత 10-11 రోజులలో వ్యాధి లక్షణములు కనిపించును.

ఈ వ్యాధిలో- ఒక్కసారిగా జ్వరము వచ్చి, అంగిట్లో ఎఱ్ఱని మచ్చలు వచ్చును. వీటిని "Koplik's Spots" అని అంటారు.

ఇది ముందు చిన్న దద్దురులుగా చెవుల వెనక; ముఖముపైన, జుట్టువున్న లైన్‌లో మొదలై కొన్ని గంటలలోనే.... శరీరము అంతటా రావచ్చును. వీటితోపాటు సహజముగా జలుబు, జ్వరము, దగ్గు, ఉంటాయి.

ఈ వ్యాధినే కొందరు "తట్టు" లేక "దద్దురు" అని ఉదహరిస్తారు. ఈ జబ్బు ఒక విధమైన వైరస్ (Virus) వలన ఉదయిస్తుంది. ఉమ్మి తుంపరల ద్వారా ఇది విస్తృతముగా వ్యాప్తి చెందుతూ.... ముఖ్యముగా పసిపిల్లలలో తఱచుగా కనిపిస్తూ వుంటుంది. భారమైన జలుబుతో మొదలై.... రెండు- మూడు రోజులలో దద్దురు ముఖ్యముగా ముఖము మీద కనిపిస్తుంది. ఈ వ్యాధి వచ్చినవారికి పూర్తిగా విశ్రాంతి కలిగించి, సాధ్యమైనంతవఱకు ద్రవ పదార్థములనే ఇస్తూ.... కాంప్లికేషన్స్ వస్తాయనే అనుమానము కలిగినప్పుడు- యాంటిబయాటిక్స్ ఎంతో జాగ్రత్తగా వాడాలి. ఈ వ్యాధి రాకుండా ముందు జాగ్రత్త చర్యగా 10-15 నెలలలో "మీసల్స్ వాక్సిన్" వేయించుట చాల అవసరము.

## MUMPS (గవద బిళ్ళలు)

'మంప్స్'నే మనము "గవదబిళ్ళలు" అని అంటాము. ఈ వైరస్ కూడా సర్వసాధారణముగా ఉమ్మితుంపరల ద్వారానే వ్యాప్తి చెందుతుంది. వ్యాధి సోకిన 1 నుండి 8 రోజులలో దీని లక్షణములు కనిపించును. ఇది సహజముగా 15 సం॥లలోపు పిల్లలలో కనిపిస్తుంది.

మొదట గవదలవద్ద కొద్దిగా నొప్పితో మొదలై.... తరువాత గొంతు నొప్పి, జ్వరము వంటివి వస్తాయి. పెరోటిడ్‌గ్లాండ్స్

(Parotid Glands)లో ఇన్ఫెక్షన్ మొదలౌతాయి. ఈ వ్యాధి సోకిన వారికి మందులు వాడకుండా.... అశ్రద్ధ చేసినచో మగపిల్లలకు- 1) ఆర్కైటిస్ (Orchitis) మఱియు వాపు (Epididymitis) రావచ్చును. 2) మెదడువాపు వ్యాధి రావచ్చు. 3) మూత్రపిండముల వ్యాధి కూడా రావచ్చు. ఇది పెద్దలకైనను రావచ్చును. ఐతే.... ఈ వ్యాధి పిల్లలకు తఱచుగా వస్తుంటుంది. ఈ వ్యాధిని ఇతరులకు అంటకుండా విధిగా రోగిని వేఱుగా వుంచాలి. ఈ వ్యాధి సోకినపుడు నొప్పి తగ్గుటకు, ఉపశాంతికి తగిన మందులు వాడుతూ ఉండాలి.

## ఆటలమ్మ (CHICKEN-POX)

ఈ వ్యాధి సోకిన 14-15 రోజులలో దీని లక్షణములు కనిపించును. మొదట తలనొప్పి, గొంతునొప్పులతో జ్వరము కనిపించును. ఒంటిపై దద్దుర్లు కనిపించును.

ఈ వ్యాధిని కొందఱు "చిన్నమ్మవారు" అని కూడా అంటారు. ఇదికూడా ఉమ్మి తుంపరల ద్వారానే ఒక విధమైన వైరస్ వలన వస్తుంది. ఏ వయస్సులోనైనను ఇది రావచ్చును. ఐతే.... సామాన్యముగా చిన్నపిల్లలలో ఎక్కువగా కనిపిస్తుంది. ఈ వ్యాధి ఒకసారి వస్తే జీవించినంతకాలము 'వ్యాధి నిరోధక శక్తి' సమకూరుతుంది. ఈ జబ్బు సోకినవారికి తొలుత నలతగా ఉండి, రెండు— మూడు రోజులలో పొట్టమీద, వీపుమీద ఎఱ్ఱని దద్దుర్లు వచ్చి, ఇవి మెల్లగా శరీరమంతటా వ్యాప్తి చెందుతాయి. తరువాత కొన్ని రోజులకు ఇవి తెల్లగా చీము పొక్కులవలె మాఱిపోతాయి. ఇటువంటి మార్పు (పొంగు) వివిధ దశలుగా జరుగుతుంది. కొన్ని పొక్కులు మాడిపోతుంటే.... మరికొన్ని క్రొత్త పొక్కులు పుడుతూ వుంటాయి. ఈ వ్యాధి సోకగానే.... రోగికి పూర్తి విశ్రాంతి నివ్వాలి. వ్యాధి సోకిన వారిని విడిగా ఉంచినట్లయితే.... కొంతవరకు ఈ వ్యాధి అదుపులో వుంటుంది. రోగికి బాగా దురదగా ఉన్నపుడు.... యాంటిహిస్టామిన్స్ (Antihistamines) ఉదా॥ ఫెరిడెకా=Ferideca మఱియు Antipruritus మందులు వాడుతూ ఉండాలి. సెకండరీ ఇన్ఫెక్షన్ (Secondary Infection) ఉంటే 'యాంటిబయాటిక్స్' జాగ్రత్తగా వాడాలి.

SCABIES (గజ్జి) : ఈ వ్యాధి "Saicoptes Scabiel" అనే సూక్ష్మక్రిమి వలన ఒకరి నుండి మరొకరికి సంక్రమిస్తుంది. తఅచుగా కలిసి మెలసి తిరిగే వారికి, Skin Contact వున్నవారికి, బడిలో పిల్లలకు, ఒకచోట కలసి పనిచేసే వారికి ఈ వ్యాధి వస్తుంది. సాధారణముగా ముందు చేతివ్రేళ్ళ మధ్యలో-దురదగా వుండి, తర్వాత నీటి పొక్కులుగా పుట్టి, సెకండరీ ఇన్‌ఫెక్షన్ వలన కుఱుపులుగా తయారౌతాయి. ఈ వ్యాధి సోకిన వారిని అంటుకోరాదు. వ్యాధి సోకిన వారందఱికి అంటే-బడిలో ఐతే పిల్లలందఱికి, ఇంటిలో ఐతే ఆ కుటుంబ సభ్యులందఱికి ఒకేసారి వైద్యము చేయుట చాలామంచిది. ఈ వ్యాధికి గురైన వారికి చికిత్స మొదలుపెట్టిన రోజున పరిశుభ్రముగా ఒడలంతా సల్ఫర్ సబ్బుతో నురగ వచ్చేదాకా రుద్ది స్నానము చేయించాలి. తరువాత 25% Benzyl Benzoate ని మెడ నుండి పాదాలవఱకు శరీరమంతటా 2 పూటలా పట్టించాలి. 2వ రోజు 3వ రోజు కూడా పై విధముగానే చేయాలి. 4వ రోజున సబ్బుతో శుభ్రముగా స్నానము చేయించాలి. ఈ లోషన్ కంటికి, నోటికి తగలకుండా జాగ్రత్త పడాలి. సెకండరీ ఇన్‌ఫెక్షన్ ఉంటే.... యాంటి బయాటిక్స్ వాడుతూ– మరల పదిరోజుల తర్వాత పైన తెలిపిన ప్రక్రియను తిరిగి అమలు చేయాలి. ఈ విధముగా వ్యాధి రాకుండా చూసుకోవాలి.

## మెదడువాపు వ్యాధి

ఈ వ్యాధిని వైద్య పరిభాషలో "జపనీస్ ఎన్‌సెఫలైటిస్" అని అంటారు. ఇది ఒక రకమైన వైరస్‌వలన సంక్రమిస్తుంది. ఇది అంటు వ్యాధి కాదు. క్యూలెక్స్ జాతికి చెందిన ఆడదోమ కుట్టుట వలన ఈ వ్యాధి వస్తుంది.

ఈ వ్యాధి ముఖ్యముగా పన్నెండు సంవత్సరాల లోపు పిల్లలకు వస్తుంది. రెండు నెలల నుండి ఐదు సంవత్సరముల వయసు పిల్లలలో మరీ ఎక్కువగా కనిపిస్తుంది. ఈ జబ్బు పెద్దలకు బహు అరుదుగా వస్తుంది.

మెదడువాపు వ్యాధి లక్షణాలు చాల త్వరితముగా బయటకు వస్తాయి. ఈ వ్యాధి సోకిన వారికి విపరీతముగా జ్వరము వస్తుంది. తల నొప్పి, దేహమంతా బాగా పోట్లుగా ఉంటుంది. పిచ్చివానిలా అర్థముకాని అలపులు-కేకలూ; చేతులు-కాళ్ళు వారి అధీనములో ఉండకుండా విప రీతముగా కదిలించుట; కొన్ని సమయాలలో ఫిట్స్ వచ్చినట్లు బిగ దీసుకుపోవుట, మెడ ఎంత వంచినా సరే కొంచెము మాత్రమే వంగుట; ఈ వ్యాధి తీవ్రమవుతున్న కొలదీ స్పృహ సాంతము కోల్పోవుట జరుగు తుంది. పై లక్షణాలన్నీ రెండు-మూడు రోజులలోనే సంభవిస్తాయి. ఈ వ్యాధి సంక్రమించిన వారిలో నూటికి 60 నుంచి 70 మంది చని పోవటమే జరుగుతుంది. ఈ మహమ్మారి నుండి తప్పించుకొని బయట పడిన పిల్లలలో చాలమందికి చేయిగానీ, కాలుగానీ పడిపోయో; జ్ఞాన వికాసము లేకుండానో, చూపు లేకుండానో, ఇంకా ఇతరమైన జబ్బుల తోనో జీవితమంతా బాధపడుట జరుగవచ్చును.

ఈ వ్యాధి రాకుండా అల్లోపతిలో ఇంజక్షన్స్ వున్నాయి. ఐతే ఇవి వ్యాధి రాకముందే చేయించాలి. వ్యాధి వచ్చిన తరువాత చేయిం చినా లాభము కంటే నష్టమే ఎక్కువ ! ఈ ఇంజక్షన్ ఒకటి చేసిన తరువాత.... పది రోజులకు మరొక ఇంజక్షన్ చేయించాలి. దీనితో కొన్ని రోజులలో వ్యాధి నిరోధక శక్తి పెరుగుతుంది.

# స్త్రీల వ్యాధులు - నివారణ

## తగిన వయసులో రజస్వల కాకపోవుట

మనదేశములోని స్త్రీలు 12 సంవత్సరముల నుండి 16-18 సంవ త్సరములలోపే యుక్తవయస్కులు (రజస్వల) ఔతారు. సెక్స్‌హార్మోన్ (Sex Hormone)ల లోపము వలన తగిన వయసులో మెన్సెస్ ప్రారం భము కాని వారికి.... అనుభవజ్ఞులైన వైద్యుని పర్యవేక్షణలో ఈస్ట్రోజన్ మందులను ఉదా॥ హార్మోన్-టి (Hormone-T), కార్నరిక్ టాబ్లెట్స్ సక్రమమైన పద్ధతిలో వాడవలయును.

## ఋతుక్రమము సరిగా లేని వారికి

చాలామంది స్త్రీలలో బహిష్టు ఒక క్రమము లేకుండా వస్తూ ఉంటుంది. సాధారణముగా ఆరోగ్యముగా ఉన్న స్త్రీలకి 28 నుండి 32 రోజులలోపు బహిష్టు ఔతుంది. ఋతుక్రమము సరిగా రాని వారికి ఈస్ట్రోజన్ మందులను సక్రమమైన రీతిలో వాడినచో గుణము కని పించును. ఉదా॥ ఓవాసైక్లిన్ (Ovacyclin) బిళ్ళలు, హార్మోన్-టి బిళ్ళలు.

## ముట్టునొప్పి (DYSMENORRHOEA)

యీ నొప్పి ఎక్కువమంది స్త్రీలలో కనిపిస్తుంది. యీ నొప్పికి ఈస్ట్రోజన్ మందులను పట్టభద్రులైన డాక్టరుల పర్యవేక్షణలో వాడవల యును. ఉదా॥ ఓవాసైక్లిన్ బిళ్ళలు, డ్యుఫాస్టన్ (Duphaston) 5-Mg బిళ్ళలు, ఆస్ట్రోఫామ్ (Oestraform) 1 Mg నుండి 5 Mg. ల ఇంజక్షన్స్.

## మధ్య మధ్యలో బ్లీడింగ్ (METRORRHEA)

దీనికి 1) ఈస్ట్రోజన్, 2) ప్రొజెస్టెరోన్ (Pregesterone) హార్మోన్స్‌తో తయారైన మందులను జాగ్రత్తగా వాడాలి. ఉదా॥ ఓవాసైక్లిన్ బిళ్ళలు ఫెటుగార్డ్ (Fetugard) 5 mg. బిళ్ళలు, లుటోసైక్లిన్ (Luto-cyclin) 10 mg నుండి 25 mg ఇంజక్షన్స్.

## పిల్లలు పుట్టకపోవుట (STERILITY)

పిల్లలు పుట్టక పోవుటకు అనేక కారణములున్నాయి. దంపతులిరువు రిలో.... ఏ ఒక్కరికి లోపమున్నా- బిడ్డలు పుట్టరు. పిల్లలు లేని దంపతులు క్వాలిఫైడ్ డాక్టర్‌ను సంప్రదించి– వారు చెప్పిన టెస్ట్‌లను జాగ్రత్తగా చేయించుకోవాలి. గోనాడో ట్రోపెన్ (Goaadotrophen) ఇంజక్షన్స్, ఫెర్టోమిడ్ (Fertomid) బిళ్ళలు వైద్యుసలహాతో వాడవచ్చును.

స్త్రీలలో వంధ్యత్వమునకు- 1) ఈస్ట్రోజన్, 2) ప్రొజెస్టెరోన్ లతో తయారైన మందులను వైద్య పర్యవేక్షణలో వాడితే.... ఉప యోగము కనిపిస్తుంది. ఉదా॥ ఆస్ట్రోఫామ్ 1-5 mg బిళ్ళలు- ఇంజ

షన్స్, ప్రొలుటాన్ (Proluton) 25 mg. బిళ్ళలు- ఇంజక్షన్స్. డిపోట్ 125 mg. నుండి 250 mg. ఇంజక్షన్స్.

స్త్రీల కుసుమ వ్యాధులకు, వంధ్యత్వానికి : ప్రొజెస్టోజెన్ + ఈస్ట్రోజెన్ కాంబినేషన్‌తో తయారైన మందులను అనుభవముగల వైద్యుల నేతృత్వములో జాగ్రత్తగా వాడవలయును. ఉదా॥ ఓవ్‌రాల్ (Ovarl) టాబ్‌లెట్స్ రోజుకు ఒకటి చొప్పున 21 రోజులు వాడవలయును. ఇంకా .... గైనోవ్‌లార్ (Gynovlar), నార్‌లెస్‌ట్రిన్ (Nor-lestrin) బిళ్ళలు కూడా రోజుకు 1 బిళ్ళ చొప్పున 21 రోజులు వాడవచ్చును.

గర్భము నిలువక పోవుట : గర్భ విచ్ఛేదము అనేక దశలలో జరుగును. తఱచుగా గర్భస్రావము జరుగు స్త్రీలు- గర్భము ధరించిన నాటి నుండి (బహిష్టులు ఆగిపోయిన నాటి నుండి) పట్టభద్రులైన వైద్యుల పర్యవేక్షణలో క్రమము తప్పకుండా.... వారు చెప్పిన మందులను, పద్ధతులను ఆచరించాలి.

గర్భము పోవు చిహ్నములు కనిపించినప్పుడు ప్రొజెస్టెరోన్‌తో తయారైన మందులను మరియు ప్రొజెస్టోజెన్+ఈస్ట్రోజెన్ కాంబినేషన్‌తో తయారైన మందులను డాక్టర్ల పర్యవేక్షణలో వాడవలయును. ఉదా॥ ఇటాస్టైక్లిన్ 0.5 mg. ఇంజక్షన్స్, ప్రోలుటాన్ 25 mg ఇంజక్షన్స్; యూనిప్రొజెస్టిన్ (Uni-Progestin) 2 C C. నుండి 10 C C. ఇంజెక్షన్స్; జెస్టానిన్ (Gestanin) 5 mg. బిళ్ళలు, గ్రావిన్‌డిన్ (Gravindin) 5 mg బిళ్ళలు. ఫెటుగార్డ్ (Fetugard) 5 mg బిళ్ళలు. ఇవి నెల తప్పినది మొదలు ప్రసవమయ్యేంత వరకు రోజుకు 1 లేక 2 బిళ్ళలు వాడవలయును.

అన్ని రకముల గర్భాశయ జబ్బులకు ప్రొజెస్టోజెన్+ఈస్ట్రోజన్‌ల కాంబినేషన్‌తో తయారైన మందులను వైద్యులు చెప్పినట్లు వాడిన గుణము కనిపించును.

## గర్భ నిరోధక చర్యలు

కొలది కాలము వఱకు పిల్లలు వద్దనుకొనే వారికి.... అనేక గర్భ నిరోధక పద్ధతులు అందుబాటులో నున్నవి.

1) ఓవ్‌రాల్ (Ovral) 0.5 mg. బిళ్ళలు బహిష్టు ఐన 5వ రోజు నుండి రోజుకు 1 బిళ్ళ చొ॥న ప్రారంభించి 21 రోజులు వాడుతూ క్రమము తప్పకుండా ప్రతినెలా ఇలాగే పిల్లలు వద్దనుకొనేవఱకు వాడుతూ ఉండాలి ఇంకా ఓవ్‌రాల్-1, నోరాసైక్లిన్ (Noracycline) అను బిళ్ళ లను కూడా పై పద్ధతిలోనే క్రమము తప్పకుండా వాడవచ్చును.

2) పురుషులు "నిరోధ్" అనే రబ్బరు తొడుగును సంపర్కము నకు ముందుగా పురుషాంగమునకు తగిలించి, రతి సలిపిన పిల్లలు పుట్టరు.

3) స్త్రీలు "లూప్" అనే సాధనాన్ని డాక్టర్ల సహాయముతో అమర్చుకొనిన పిల్లలు పుట్టరు. ఇది ప్రతి సం॥ము మార్చుకొంటే మంచిది. పిల్లలు కావాలనుకొన్నప్పుడు- ఇది డాక్టర్ల సహాయమున తీసివేస్తే.... పిల్లలు పుడతారు. ఇటువంటివి అనేకమున్నవి. అనుభవజ్ఞులైన డాక్టర్‌ను సంప్రదించి వాటిని ఆచరించవలెను. ఒకవేళ గర్భము వద్దనుకొనేవారికి ఏదైనా పొరపాటు వలన గర్భము వస్తే.... దానిని పట్టభద్రులైన వైద్యు నిచే శస్త్ర చికిత్స ద్వారా తొలగించుకోవాలి. మందుల వలన గర్భస్రా వము కాదు అలా చేయకూడదు.

## గర్భ నిర్ధారణ

బహిష్టులు సక్రమముగా వచ్చు స్త్రీలు– ఋతుక్రమము ఆగిపోయి నప్పుడు- గర్భము దాల్చినది లేనిది తెలిసికోవాలంటే.... చివరి బహిష్టుకు 6 వారముల తరువాత వైద్యుని పర్యవేక్షణలో మూత్రపరీక్ష జరిపి తెలిసి కోవాలి,

వైట్ [తెలుపు] డిశ్చార్జ్ : కొంతమంది స్త్రీలకు తఱచుగా White Discharge ఔతూ ఉంటుంది. ఈ వ్యాధిని వైద్య పరిభాషలో "వుల్వావజైనైటీస్ (Vulvovaginitis)" అని అంటారు. ఈ వ్యాధి చిన్న పిల్లలకు కూడా రావచ్చును. పిల్లలకు మామూలు యాంటిబయాటిక్ మందులు వాడవచ్చును. యీ జబ్బు ఉన్న పెద్దవారు ట్రికోమోనాసైడ్స (Trichomonacides) మందులను వైద్యుడు చెప్పినట్లుగా వాడినచో- యీ వ్యాధి స్త్రీలకు దూరమౌతుంది. ఉదా॥ మెట్రోనిడాజోల్, ఫ్లాజిల్-ఎం. & బి. (Flagyl-M & B), యూనిమెజోల్, మెట్రాల్ బిళ్ళలు- వీటిలో ఏదో ఒకటి రోజుకు 3 చొ॥న 10 రోజులు వాడితే వ్యాధి నయమౌతుంది తెలుపు లేక లుకోరియా (Leucorrhoea)లో గైనో-స్టిరోసాన్ (Gyno-Sterosan), వజినాల్ (Vaginal) బిళ్ళలుగాని లేక వియోజాల్ (Viozol) బిళ్ళలుగాని, వజిఫ్లాన్ (Vagiflan) బిళ్ళలు గాని యోని మార్గములో పెట్టి ఉంచినను తెలుపు కాదు.

ఋతుక్రమమును ఆపుట : ఏమైన అవసరము కలిగించు కార్యక్రమములు అంటే.... శుభకార్యాలు, ప్రయాణాలు మొ॥నవి వచ్చినపుడు-బహిష్టు వాయిదా వేయుటకు ప్రొజెస్టోజెన్+ఈస్ట్రోజన్ కాంబినేషన్‌తో తయారైన మందులను, ఈస్ట్రోజన్‌తో తయారైన మందులను వైద్యుల సలహాపై వాడవలెను. ఉదా॥ నోరాసైక్లిన్-2 (Noracyclin -2), డిసిక్రాన్ (Desecron) 1 C. C. యాంపుల్స్.

బ్రెస్ట్ కాన్సర్ (BREAST CANCER): ఈ వ్యాధి ఉన్నవారు వైద్య పర్యవేక్షణలో- శస్త్ర చికిత్స ద్వారా గానీ, రేడియమ్ చికిత్స ద్వారా గానీ నివారించుకోవాలి.

బాలింతలకు పాలు వృద్ధియగుట : కొంతమంది బాలింతలకు బిడ్డకు సరిపోయినన్ని పాలు ఉండవు. విటమిన్-D లోపించుట

వలన ఇలా జరుగుతుంది. దీనిని స్టిల్‌బోస్టెరాల్ (Stilbosterol) హార్మోన్‌లో తయారైన మందులను వాడాలి. ఉదా॥ క్లినిస్ట్రాల్ (Clinistrol) 1 mg. నుండి 5 mg. బిళ్ళలు-ఇంజక్షన్స్, విటమిన్ డాన్-డి (Vitamin Don-D) బిళ్ళలు, స్టిరోజిల్-15 (Sterogyl-15) ఇంజక్షన్స్ మొ॥నవి.

## బాలింతలకు పాలు తగ్గుటకు

ఏ కారణము చేతనైనా పిల్లలు చనిపోయినపుడు బాలింతలకు పాలు తగ్గించుటకు ఎతినితో ఈస్ట్రాడియాల్+టెస్టోస్టెరాన్ కాంబినేషన్‌తో తయారైన మందులను డాక్టర్ సలహాల ననుసరించి వాడవలయును. ఉదా॥ హార్మొటోన్-ఎమ్ (Hormotone-M) బిళ్ళలు, మిక్సోజెన్ (Mixogen) ఇంజక్షన్స్-బిళ్ళలు.

## గర్భిణీ స్త్రీలలో వాంతులు

స్త్రీలలో చాలా ఎక్కువమందికి గర్భము ధరించిన 2, 3 నెలల వరకు వాంతులు-వికారము ఉంటుంది. అటువంటివారు పైరిడాక్సిన్ (Fyridoxin), పైరిడాక్సిన్+యాంటిహిస్టామిన్, పైరిడాక్సిన్+ట్రాంక్విలైజర్స్ మొదలగు కాంబినేషన్‌లతో తయారైన మందులను వైద్య సలహాల ననుసరించి వాడినచో- మంచి గుణము కనిపించును. ఉదా॥ గ్లాడాక్సిన్ (Glodoxin) బిళ్ళలు-ఇంజక్షన్స్, సిరిడాక్సిన్ (Siridoxin) బిళ్ళలు, పైరిడోప్లాన్ (Phyridoplon) C. C. వైన్స్.

# సాధారణ వ్యాధులు-నివారణ

## వివిధ తల నొప్పులు

తలనొప్పి దరిదాపుగా అందరికీ అనుభవమున్నదే! ఇది వివిధ రకాలుగా వస్తుంది. కొందరికి టెన్షన్ వలన, మరికొందరికి ఎండలో

తిరుగుటవలన, ఇంకొందఱికి శబ్దము వినుట వలన, ఇంకా జ్వరము-జలుబుల వలన ఇలా.... ఎన్నో సందర్భాలలో తలనొప్పి వస్తుంది.

టెన్షన్‌తో తలనొప్పి : విపరీతమైన పనుల ఒత్తిడి వలన వచ్చే తలనొప్పికి ఎనాల్‌జిసిక్స్ (Analgesics) తో తయారైన మందులు, సాలిసైలేట్స్ (Salicylates [A P C]) తో తయారైన మందులు వైద్య సలహాపై వాడవలెను. ఉదా॥ ఆస్ప్రిన్ (Asprin) బిళ్ళలు; సారిడాన్ (Saridan), కోడోపైరిన్ (Codopyrine) బిళ్ళలు; అనాల్ జిన్ (Analgin) బిళ్ళలు, వాలియమ్-2 (Valium-2) బిళ్ళలు.

కంటిచూపు వలన తలనొప్పి : కొందఱికి కంటికి శ్రమ కలిగే పనులు చేసినప్పుడు అంటే సినిమా చూచుట, చదువుట ఇత్యాదుల వలన వచ్చే తలనొప్పులకు మందులు పనిచేయవు. వారు నేత్రవైద్యుని సంప్రదించి, కళ్ళకు జోడు పెట్టుకొనవలయును.

మనో బలహీనత వలన తలనొప్పి : కొందఱికి ఏ కారణము లేకుండానే తలనొప్పి వస్తుంది. ఇది మనోదుర్బలత్వము వలన వస్తుంది. వీరు ప్రతిదానికి నీరసించిపోతారు. వీరు పెద్ద గుడ్డ తీసికొని తలకు కట్టుకొని, దిగులుతో రోజులు తరబడి తలనొప్పితో బాధపడుతుంటారు. వీరికి పగలు-రాత్రి ఒకే విధముగా నొప్పి వుంటుంది. వీరికి మామూలు మందులు ఎంత మాత్రము పని చేయవు. పట్టభద్రులైన డాక్టర్ల పర్యవేక్షణలో ట్రాంక్విలైజర్స్ (Tranquilizers) తో తయారైన మందులు వాడాలి. ఉదా॥ సెరిపాక్స్ (Serepax) బిళ్ళలు-ఇంజక్షన్‌లు, సిరాల్ఫా (Seralfa) బిళ్ళలు, బ్రోమోఫెన్ (Bromofen) B-1 లిక్విడ్ మొ॥నవి.

నిద్ర వచ్చేందుకు హిప్నాటిక్స్ సెడేటివ్స్ (Hypnotics-Sedatives)తో తయారైన మందులు జాగ్రత్తగా వాడిన ఈ తలనొప్పి తగ్గిపోవును. ఉదా॥ హాల్‌బాక్ (Halbak) బిళ్ళలు, కార్‌బెటాల్ (Carbetal) గొట్టములు.

మైగ్రేన్ (MIGRAINE) : మెదడుకు రక్త ప్రసరణ సరిగా లేక ఈ నొప్పి వస్తుంది. ఇది భరించుట చాల కష్టము ! దీనికి మైగ్రానిల్ (Migranil) బిళ్ళలుగాని, కేఫర్‌గాట్ (Cafergot) బిళ్ళలు గానీ రోజుకు 2 బిళ్ళల చొప్పున కొన్ని రోజులు గుణము కనిపించే వరకు వైద్య పర్యవేక్షణలో వాడవలెను.

సైనుసైటిస్ (SINUSITIS) : ముక్కుకు రెండు ప్రక్కలా రెండు ఎముకల గదులు ఉంటాయి. అవి ముక్కుకు కొంచెము పైగా ఉంటాయి. వీటికే ముక్కును కలిపే రంధ్రాలు ఉంటాయి. ముక్కు లోనికి చేరిన వ్యాధి క్రిములు- రంధ్రాల ద్వారా ఎముకల గదులలోనికి ప్రవేశించి, లోపల ఉండే పొరను వాచేటట్టు చేస్తాయి. ఇలాంటి సమయా లలో అక్కడ చెడునీరు చేరుతుంది. మామూలుగా ముక్కు రంధ్రాలకు, ఎముకల గదుల రంధ్రాలకు ఉండే సంబంధము లేకుండా టిష్యూ పొరలు వాచుటచే ఆ నీరు బయటకు వచ్చుటకు వీలులేక.... అక్కడే వుండి పోతుంది. ఆ నీటి ఒత్తిడికి విపరీతమైన నొప్పితో తలంతా బరువుగా వుంటుంది.

ఈ నొప్పి చెంపకు ఒక ప్రక్కనే ఎక్కువగా వస్తుంది. అందుకే దీనిని "పార్శ్వ నొప్పి" అని కూడా అంటుంటారు. ఈ నొప్పి కొన్ని సమయాలలో రెండు ప్రక్కలా వస్తుంది.

ఈ నొప్పికి యాంటీబయాటిక్ మందులను వాడాలి. ఉదా॥ పెనిసిలిన్ (Penicilin) బిళ్ళలు- ఇంజక్షన్స్, టెట్రాసైక్లిన్ గొట్టములు, ఎరిత్రోమైసిన్ (Erythromycin) బిళ్ళలు- ఇంజక్షన్స్ మొ॥నవి.

కొన్ని కేసులలో ఎముకల గదులలోని రంధ్రములు చిన్నవైనా ఈ నొప్పి వస్తుంది. దీనికి మందులు పనిచేయవు. E. N. T. స్పెషలిస్ట్ లను సంప్రదించి, శస్త్రచికిత్స చేయించుకోవాలి.

## ఇతర బాధల వలన తలనొప్పులు

కొన్ని ఇతర వ్యాధుల వలన కూడా తలనొప్పులు వస్తాయి. జ్వరములో, పంటి బాధవలన; కంటికివచ్చే- "ఐరైటిస్", "గ్లాకోమా"

అనే వ్యాధుల వలన; ముక్కులు బిగపట్టినప్పుడు, ముక్కు ప్రక్కన ఉన్న ఎముకల గదులలో చెడునీరు జేరినా కూడా యీ తలనొప్పి వస్తుంది. ఏది ఏమైనా.... తలనొప్పి చాల చికాకును కలిగిస్తుంది. ఇతర వ్యాధుల వలన తలనొప్పి ఉన్నవారు ఆయా వ్యాధులకు సంబంధించిన వైద్య పట్టభద్రులను సంప్రదించి, తగిన చికిత్సను పొంది, శాశ్వతమైన నివారణను పొందవలెను.

# వివిధ జ్వరములు-నివారణ

మామూలుగా ఉండే వేడికన్నా.... అధికముగా మన శరీరము వేడిగా ఉంటే... దాన్ని "జ్వరము" అంటారు. ఇది అనేక రకాల వ్యాధులలో కూడా వస్తుంది. ఒక్కొక్కసారి జ్వరముతో పాటు- తలనొప్పి, వికారము, వాంతులు, దగ్గులు, విరేచనాలు, జలుబు ఉంటాయి. కొన్నిసార్లు చలి-వణకు రావచ్చును. మరికొన్నిసార్లు ఒంటిమీద పొక్కులు రావచ్చును. ఇంకొన్నిసార్లు ఊపిరి పీల్చుట కష్టము కావచ్చును లేదా వేగముగా ఊపిరి పీల్చవలసి రావచ్చును. జబ్బులకు కారణమయ్యే సూక్ష్మక్రిములు- మన దేహములో ప్రవేశించినప్పుడు- శరీరములో ఉండే "వ్యాధి నిరోధక శక్తి" ఆ క్రిములతో పోరాటము జరుపుతుంది. యీ సందర్భములో- దేహానికి శ్రమ ఎక్కువై, అధిక ఉష్ణము పుట్టి అది బయటకు వస్తుంది. దానినే "జ్వరము" అని అంటారు. ఏది ఏమైనా యీ జ్వరము ఎందువలన వచ్చిందో.... జాగ్రత్తగా వైద్యులచే నిర్ణయము చేయించి, వారు చెప్పినట్లు మందులను, విశ్రాంతిని తీసికోవలెను.

## ఉడుకు జ్వరము

యీ జ్వరము వేసవికాలములో ఎండవేడిమికి శరీరము బాగా వేడెక్కుటవలన వస్తుంది. దీనిని "వడదెబ్బ"గా కొందరు భ్రమ పడతారు కాని వడదెబ్బ తగిలిన వారికి చెమట పోయుట ఆగిపోతుంది. యీ ఉడుకు జ్వరానికి చెమట మామూలుగా పోయుటయే గాకుండా.... దేహమందలి "హీట్ రెగ్యులేటర్" మామూలుగానే పనిచేస్తూ వుంటుంది.

యీ జ్వరము వచ్చినవారిని చల్లగా ఉండే గదులలో వుంచి-

కిటికీలకు, తలుపులకు తడిగుడ్డలు కట్టి; యీ గుడ్డలు ఎప్పుడూ ఆరకుండా నీళ్ళు చల్లుతూ ఉండాలి. రోగి శరీరాన్ని తడి బట్టలతో తడుస్తూ, బాగా చల్లపఱుస్తూ ఉండాలి. ఇవన్నీ చేస్తూ పారాసెటమాల్ (Paracetamol)తో తయారైన మందులు వాడితే.... యీ జ్వరము రెండు రోజులలో తగ్గిపోతుంది. ఉదా॥ క్రోసిన్ (Crocin) బిళ్ళలు, మెటాసిన్ (Metacin) బిళ్ళలు.

ఫ్లూ-జ్వరము : ఇది వైరస్ ఇన్‌ఫెక్షన్ వలన సంక్రమిస్తుంది. ఇది సోకినవారికి కాళ్ళు, చేతులు మఱియు ఒళ్ళంతా నలుపుగా వుంటుంది. చాల నీరసముగా వుండి, కళ్ళు మంటలు పుడతాయి. పారాసెటమాల్‌తో తయారైన మందులువాడి, దీనిని నిరోధించాలి. ఉదా॥ క్రోసిన్ (Crocin) బిళ్ళలు, మెటాసిన్ (Metacin) బిళ్ళలు, ఎరిత్రోమైసిన్ (Erythromycin), ఆల్‌త్రోసిన్ (Althrocin) బిళ్ళలు, ఎరిస్టర్ (Eryster) బిళ్ళలు మొ॥నవి.

యీ జ్వరానికి మందులకంటే విశ్రాంతి చాల అవసరము! బాధ అధికముగా ఉన్నప్పుడు A. P. C. బిళ్ళలుగానీ, వెగానిన్ (Veganin) బిళ్ళలుగానీ, అల్ట్రాజిన్ (Ultragin) బిళ్ళలుగాని ఒకటి రెండు తీసికొని బాగా నిద్రపోతే....చాలవఱకు తగ్గిపోతుంది. సాధారణముగా యీ ఫ్లూ జ్వరమునకు ఆవిరిపడితే....కొంత స్వస్థత చేకూరుతుంది. సాధారణముగా 3 నుండి 6 రోజులలో యీ జ్వరము తగ్గుముఖము పడుతుంది.

ఫ్లూ తగ్గకుండా, విపరీతమైన జ్వరము ఉండి; ఛాతిలో నొప్పి, జలుబు, దగ్గు ఎక్కువగా వున్నవారు దీనిని "బ్రాంకైటిస్"గా గుర్తించి వైద్యుల పర్యవేక్షణలో తగిన విధముగా చికిత్స చేయించుకోవాలి.

మలేరియా జ్వరము (MALARIA) : ఏ వయసు వారికైనా, స్త్రీ-పురుష భేదము లేకుండా యీ వ్యాధి రావచ్చును! యీ వ్యాధి సోకినవారికి జ్వరము, చలి, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు వుంటాయి. ఇది ప్రారంభమైన రోజు పైన చెప్పిన లక్షణాలన్నీ వుంటాయి. ఒక వారము పోయిన తరువాత యీ జ్వరము క్రమము తప్పకుండా రోజు విడిచి రోజుగాని; రెండు రోజులకు ఒకసారిగాని వస్తుంది. యీ వ్యాధి

సోకిన వారిని వెంటనే డాక్టర్‌కు చూపించి, రక్తపరీక్ష చేయించి "క్లోరోక్విన్ (Chloroquin)"తో తయారైన మందులు వాడి; మలేరియా జ్వరాన్ని పూర్తిగా నిర్మూలించాలి. ఉదా॥ కామోక్విన్ (Camoquine) లరియగో (Lariago), ఎమ్ క్విన్ (M Quine), నివాక్విన్ (Niva quine) బిళ్ళలు- ఇంజక్షన్స్ మొ॥నవి.

"Plasmodium" అనే క్రిమి వలన వచ్చే మలేరియా ఒకరి నుండి ఇంకొకరికి "ఎనోఫిలస్ (Anopheles)" అను దోమ ద్వారా వ్యాపించును. కొండల (600 అడుగుల పైన) మీద నివసించే వారిలో మలేరియా చాలా తక్కువగా కనిపిస్తుంది.

వ్యాధి సోకిన తరువాత 10–15 రోజులకు కాని వ్యాధి లక్షణములు కనిపించవు. మొదట బద్ధకము, ఆకలి లేకపోవుట, తలనొప్పి, చలితోపాటు జ్వరము మున్నగు లక్షణాలతో ఈ వ్యాధి మొదలౌతుంది.

టైఫాయిడ్ జ్వరము (ENTERIC FEVER) : ఈ జ్వరము వచ్చుటకు ముఖ్యమైన కారణము "సాల్మొనెల్లా టైఫోసియా (Salmonella Typhosia)" అనే బాక్టీరియా క్రిములు! ఇవి కలుషితమైన నీరు, పాలు, ఆహార పదార్థముల ద్వారా జీర్ణకోశములో చేరి- ఈ వ్యాధిని కలిగిస్తాయి. ఈ క్రిములు జీర్ణకోశములో ప్రవేశించిన తరువాత 10 లేక 15 రోజులలో వ్యాధి లక్షణాలు బయటకు వస్తాయి. ఈ జ్వరము వలన కొందరికి విపరీతమైన దుర్లక్షణాలు కనిపిస్తాయి.

ఈ వ్యాధి సోకినవారికి మొదట నీరసముగా వుండి, మెల్ల మెల్లగా ఆకలి మందగించిపోతుంది. తలనొప్పి, దగ్గు, గొంతు నొప్పి ఇలా.... రెండు మూడు రోజులు వుండి; తదుపరి ఇవన్నీ విపరీతముగా పెరిగిపోతాయి. మలబద్ధకము, పొత్తి కడుపులో నొప్పి, ప్రొద్దున కంటే సాయంత్రము పూట తీవ్రస్థాయిలో జ్వరమువచ్చుట జరుగుతుంది. కొందరికి ఒంటిమీద ఎర్రటి మచ్చలు కూడా రావచ్చును. ఈ జ్వరము సోకినవారు దీన్ని 'టైఫాయిడ్'గా గుర్తించలేక ఏవో మందులు వాడి, దీన్ని మరింతగా పెంచుకొంటుంటారు. ఇప్పుడు ఈ జ్వరానికి చక్కని మందులు వున్నాయి.

క్లోరమ్ ఫెనికాల్‌తో తయారయిన మందులను వైద్యుల పర్యవేక్షణలో వాడితే.... జ్వరము రెండు–మూడు రోజులలో అదుపులోకి వస్తుంది. ఉదా॥ క్లోరోమైసిటిన్ (Chloromycetin) 2 Mg గొట్టములు, 1 M ఇంజక్షన్‌లు; రెక్లోర్ (Reclor) గొట్టములు మొ॥నవి.

ఈ మందులు పూర్తి కోర్స్ రెండు వారాలు వాడాలి. ఆహారము మామూలుగా తీసికోగూడదు. ఈ జ్వరము వచ్చినవారి జీర్ణకోశము పచ్చిపుండు ఔతుంది. ఈ సమయములో ఎక్కువగా గ్లూకోజ్, హార్లిక్స్ పండ్ల రసము, మజ్జిగలాంటి ద్రవ పదార్థములనే వాడాలి. మామూలు ఆహారము తీసికోరాదు.

ఈ వ్యాధి సోకినవారు నోటిని చాలా శుభ్రముగా ఉంచుకోవాల. ఈ రోగి విసర్జించిన మల-మూత్రముల ద్వారా ఇతరులకు తేలికగా ఈ జబ్బు వస్తుంది. కాబట్టి మిగిలినవారు చాలా జాగ్రత్తగా వుండుట అవసరము "క్లోరోమైసిటిన్" మందులను పూర్తి కోర్స్ వాడకపోతే మరల తిరగబెడుతుంది. ఈ విషయము తెలియక చాలమంది దీనిని "డబుల్ టైఫాయిడ్" వచ్చినదని చెబుతుంటారు.

ఈ వ్యాధిని శాశ్వతముగా నిర్మూలించుటకు T. A. B. వాక్సిన్ వారానికి ఒకసారి చొ॥న మూడువారములు వేయించుకొని, మరలా ఒక సంవత్సరము అగిన తరువాత ఒకసారి వేయించుకొంటే.... టైఫాయిడ్ జ్వరాన్ని నిర్మూలించుకోవచ్చును.

కీళ్ళనొప్పుల జ్వరము (RHEUMATIC FEVER) : ఇది చాల ప్రమాదకరమైన జ్వరము ! ఈ వ్యాధి వచ్చుటకు రెండు-మూడు వారాలముందుగా గొంతునొప్పి వస్తుంది. ఈ జ్వరములో మోకాళ్ళు-మోచేతులు, మడమలు, ఇతర కీళ్ళు వాచి బాధపెడతాయి. కొంతమందిలో కీళ్ళవాపులు లేకుండానే నొప్పి పెడతాయి. మరికొందఱికి కీళ్ళనొప్పులు చాలా కొద్దిగానే ఉంటాయి. ఇది సాధారణముగా 5 నుండి 15 ఏళ్ళలోపు పిల్లలకు మాత్రమే వస్తుంది. ఈ జ్వరము ముదిరితే విపరీత పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఈ జ్వరము మొదటిసారి వచ్చినప్పుడే మళ్ళీ రాకుండా వైద్యుల సలహాల ననుసరించి "లాంగ్ ఏక్టింగ్ పెనిసిలిన్"

ఇంజక్షన్ నెలకొకసారి చొప్పునగానీ; "పెనిసిలిన్" లేదా "సల్ఫా" బిళ్ళలను ప్రతిరోజుగానీ వాడాలి. ఇలా.... 20 లేక 25 సంవత్సరాల వయస్సు వచ్చేవరకు వాడాలి.

ఈ వ్యాధిని అశ్రద్ధ చేస్తే "రుమాటిక్ వాల్వులార్ హార్ట్ డిసీజ్ (Rheumatic Valvular Heart Disease)" అనే గుండెజబ్బులలోనే ముఖ్యమైన వ్యాధిగా తీవ్రరూపము దాలుస్తుంది. కీళ్ళనొప్పుల జ్వరము వచ్చిన వెంటనే వైద్యుని సంప్రదించి, వెంటనే తగిన చికిత్సచేసి, దీన్ని అంతము చేయకపోతే- ముందు ముందు "పిల్లల భవిష్యత్తు" రోగగ్రస్తమై ఎందుకూ పనికిరాని వారుగా తయారౌతారు.

సాధారణమైన జ్వరము : విశ్రాంతి లేకుండా పనిచేసినప్పుడు వ్యాధి విరోధకశక్తి లోపించినప్పుడు : శరీరము అలసిపోయి, నీరసము, విసుగ్తువ, తలనొప్పి, ఒళ్ళు నొప్పులు, ఇలా అనేక మార్పులు వచ్చి జ్వరము వస్తుంది. సర్వసాధారణముగా యీ లక్షణాలు అందరూ ఎప్పుడో ఒకప్పుడు అనుభవించే ఉంటారు. యీ జ్వరానికి మందుకంటే విశ్రాంతి బాగా అవసరము! ధారాళముగా గాలివచ్చే ప్రదేశములో రెండు-మూడు రోజులు విశ్రాంతి తీసికొంటూ.... పేరా సెటమాల్‌తో తయారయిన మందు బిళ్ళలను 1-2 వేసికోవాలి. ఉదా॥ క్రోసిన్ (Crocin), ఆక్టిమాల్ (Actimol) బిళ్ళలు మొ॥నవి, పసిపిల్లలైతే.... "అనాప్లాన్", "మెటాసిన్" డ్రాప్స్ వేయాలి.

రెండు-మూడు రోజులకు కూడా జ్వరము తగ్గకపోతే.... వెంటనే వైద్యులను సంప్రదించి, తగిన చికిత్స చేయించుకోవాలి.

ఇన్‌ఫ్లూయెంజా (INFLUENZA) జ్వరము : ఇది అకస్మాత్తుగా వచ్చే జ్వరము! యీ "ఇన్‌ఫ్లూయెంజా"ని ఫ్లూజ్వరముగా కొందరు అంటారు. ఈ జ్వరము వచ్చుటకు అతిసూక్ష్మమైన వైరస్ కారణము! ఇన్‌ఫ్లూయెంజా జ్వరము సోకినవారికి ముందుగా ఒళ్ళంతా పగులగొట్టినట్లుగా నొప్పి ఉంటుంది. తల విపరీతముగా నొప్పి పెడుతుంది. తీవ్రమైన

చలి వేస్తుంది. కొందఱికి పెద్ద వాంతి ఔతుంది. ఇది చలి-జ్వరముతో వచ్చుట వలన కొందఱు దీన్ని "మలేరియా జ్వరము" అనికూడా భ్రమ పడతారు. జ్వరముతోగాని, జ్వరము వచ్చిన తరువాతగాని గొంతు నొప్పి బయలుదేరుతుంది. పొడిదగ్గు, జలుబు వస్తుంది. దగ్గువలన ఛాతిలో మంట-నొప్పి వస్తాయి. మాట బొంగురుగా వస్తుంది. "ఇన్‌ఫ్లూయెంజా" వచ్చిన కొందఱికి కడుపులో వికారముగా ఉండి ఏమీ తినుట, త్రాగుట లాంటివి చేయబుద్ధికాదు.

ఇంతాచేసి ఈ జ్వరము రెండు మూడు రోజులలో తగ్గిపోతుంది. కానీ– ఇది వచ్చివెళ్ళిన 10, 11 రోజుల వఱకు నిస్సత్తువగా ఉండి; ఏ పని చేయుటకైనా ఓపికలేక నీరసించిపోతారు.

ఈ జ్వరము వచ్చినవారు వైద్య పర్యవేక్షణలో జ్వరము తగ్గుటకు ఒళ్ళునొప్పులు తగ్గటానికి యాంటీబయాటిక్ బిళ్ళలు వాడాలి. బాగా నీరసముగా ఉన్న వారికి పండ్లరసము, మజ్జిగ, బి-కాంప్లెక్స్ బిళ్ళలు వేసికొంటే నీరసము కొన్నిరోజులలో తగ్గిపోతుంది. ఎక్కడో నూటికి-కోటికి ఒకరికి ఈ వ్యాధి కలిగించే క్రిములు మెదడుకు సోకి "వైరల్ మెనిన్‌జైటిస్" అనే వ్యాధి సంక్రమిస్తుంది. ఎక్కువ మందికి ఈ జ్వరము ఎటువంటి దుష్ఫలితాలు లేకుండానే తగ్గిపోతుంది.

## ఎలుకలు కొఱికితే వచ్చే జ్వరము

"సైకిల్లమ్ మైనస్" అనే సూక్ష్మక్రిములు ఎలుకలలో ఉండి.... అవి కాటు వేసినప్పుడు- మన శరీరములో ప్రవేశించి ఈ జ్వరాన్ని కలిగిస్తాయి. ఈ జ్వరము వచ్చేముందు వాంతులు- వికారము, చెమట పట్టును. తలనొప్పి; దేహమంతా పోట్లు ఉంటాయి.

ఈ జ్వరము ఎలుకలు కఱచిన 10 రోజులనుండి 60 రోజుల లోపు ఎప్పుడైనా రావచ్చు. ఈ జ్వరాన్ని "మలేరియా జ్వరము"గా భావించే వారుకూడా ఉన్నారు. ఎందుకంటే ఈ జ్వరము వచ్చేటైమ్‌కి సాధారణముగా ఎలుక కఱచిన గాయము మానిపోతోంది. కాబట్టి ఎలుక వలన జ్వరము వచ్చినదని భావించలేరు. ఈ క్రిములు ఒక్కోసారి రక్త పరీక్షలో కూడా కానరావు. ఎలుక కఱిస్తే వచ్చే యీ జ్వరము 4 రోజు

లుంటే నాలుగు రోజులు ఉండదు. కానీ జ్వరము వచ్చేముందు చలి ఉంటుంది. ఈ వ్యాధి సోకినవారు వైద్య పర్యవేక్షణలో "పెనిసిలిన్" ఇంజక్షన్ లేదా "టెట్రాసైక్లిన్" క్యాప్సూల్స్‌వంటి, 'యాంటీబయాటిక్స్' పది రోజులపాటు ఉదయము, సాయంత్రము వాడితే జ్వరము తగ్గి పోతుంది.

## జ్వరములో తీసుకోవలసిన జాగ్రత్తలు

జ్వరము వచ్చినవారికి ఒంటిమీద ఉన్న దుస్తులను తీసివేసి, శరీర మంతా చల్లనిగుడ్డ కప్పాలి. తడి ఆఱకుండా ఆ గుడ్డమీద ఎప్పుడూ చల్లటినీరు చల్లుతూ ఉండాలి. త్రాగుటకు ఎప్పుడూ చల్లటి నీళ్ళుగానీ, గ్లూకోస్ నీళ్ళుగానీ, కొబ్బరి నీళ్ళుగానీ విపరీతముగా ఇవ్వాలి. బాగా గాలివచ్చే ప్రదేశములో పడుకోబెట్టి ఎప్పుడూ విసరుతూ ఉండాలి. (ఫ్యాన్ గాలి ఐనా ఫరవాలేదు) తరువాత క్రోసిన్‌గానీ, మెటాసిన్ గానీ, ఆస్ప్రోగానీ ఒకటి-రెండు బిళ్ళలు వేసి బాగా విశ్రాంతిని ఇవ్వాలి. జ్వరము తగ్గితే తడిగుడ్డ తీసివేసి, ప్రతి అరగంటకూ ఒకసారి తడిగుడ్డతో దేహమంతా తుడుస్తూ ఉండాలి. ఇలాచేస్తే.... జ్వరము చాల వఱకు తగ్గిపోతుంది.

## గౌట్ (GOUT) వ్యాధి-నివారణ

GOUT : సహజముగా 30 సం॥ల పైబడి స్థూలముగా వున్న వారిలో ఈ వ్యాధి కనిపించవచ్చు. కొందఱిలో రక్తపోటు, సుగర్‌వలె వంశ పారంపర్యముగా కూడా ఇది రావచ్చు. ఈ జబ్బు సోకిన వారికి హఠాత్తుగా కాలి బొటనవ్రేలు విపరీతమైన నొప్పిగా ఉంటుంది. ఈ నొప్పి రాత్రులయందు నిద్రలో వస్తుంది. కొన్ని గంటలలో బొటన వ్రేలు విపరీతముగా వాచి, కందిపోతుంది. కాలు కదిపినా భరించ లేనంత నొప్పి ఉంటుంది. కాలి బొటనవ్రేలు మాత్రమే వాచి ఈ జబ్బుకు జ్వరముకూడ కొంచెము ఉంటుంది. ఈ జబ్బు రావడానికి మాంసకృత్తులలో "ప్యూరిన్ మెటబాలిజమ్" లోపించటమే ముఖ్య మయిన కారణము! అరుదుగా కొందఱికి మిగిలిన వ్రేళ్లు కూడా వాస్తాయి. మరి కొందఱికి మాత్రము కాళ్ల-చేతులకు సంబంధించిన

కీళ్ళవాపులు ఒకసారే వచ్చి, తగ్గకుండా.... మళ్ళీ-మళ్ళీ వచ్చి భరించ లేనంత నొప్పిని కలిగిస్తాయి.

ఈ వ్యాధి ఇలా వచ్చిపోతుంటే కాలి బొటనవ్రేలే కాకుండా ఆ కాలి మడమ, చేతియొక్క మణికట్టు, మోకాలు, మోచేయి, తుంటి, గూడలయొక్క కీళ్ళు-ఎముకలు పాడైపోతాయి. ఈ వ్యాధి సోకినవారిలో కొద్దిమంది మాత్రము జీవితాంతము బాధలు పడుతూనే వుంటారు. ఈ వ్యాధి ముదిరిన వారికి మూత్రపిండాలు కూడా దెబ్బతినే అవకాశము చాల దగ్గఱగా ఉంటుంది. గౌట్ సోకిన వారికి "యూరిక్ యాసిడ్" తొమ్మిది mg. కంటే పెరుగకుండా చూడాలి. "ప్యూరిన్" ఎక్కువగా వుండే పదార్థాలు- అంటే తియ్యని రొట్టె, చేపలు, జంతువుల మూత్ర పిండాలు- కార్జము- కాలేయము, మద్యపానము- మాదకద్రవ్యాలు మొ॥నవి పూర్తిగా విసర్జించాలి. మంచి వైద్యుల పర్యవేక్షణలో ఎనాల్జిసిక్ (Anaigesic)తో తయారైన మందులను జాగ్రత్తగా వాడవలెను. ఉదా॥ : తరుణదశలో కోల్చిసిన్ (Colchicine), ఐడిసిన్ (Idicin) బిళ్ళలు, ఆర్టిరాన్ (Artiaan), గొట్టాలు– మందులు; సాల్సిలేట్స్ మందులు; ఫినిల్ బుటాజోన్ (Phenyl butozone).

## బెల్స్‌పాల్సీ (మూతి వంకర వ్యాధి)

వైద్య పరిజ్ఞానము లేనివారు దీనిని "గ్రహణము పోయింది" అని, "పక్షవాతము వచ్చింది" అని అంటుంటారు. పల్లెలలో ఐతే కొందఱు తెలియక ఈ వ్యాధికి పావురాల రక్తము పూస్తారు. మరి కొందఱు దీన్ని వాతనొప్పిగా భావించి విరేచనాలకు గుళికలు కూడా మ్రింగుతుంటారు.

ఇలా మూతి వంకర పోవుటకు కారణము చెవిపైన ఉండే "ఫేషియల్‌నర్వ్" ఒత్తిడికి గురి అగుటయే ఈ "బెల్స్‌పాల్సీ" జబ్బుకు మూతి మాత్రమే వంకరపోతుంది. కాని కొందఱు అనుకొనేటట్లు కాళ్ళు-చేతులు పక్షవాతానికి గురి అయ్యే ముందుగా ఇలా జరుగదు. దానికి దీనికి అసలు సంబంధమే లేదు. ఇది ఒక ప్రత్యేకమైన వ్యాధిమాత్రమే!

మూతి వంకర కలిగించే ఈ నరముల వ్యాధి రావడానికి రెండు రోజుల ముందుగా రెండు చెవులలో ఒకదాని వెనుక నొప్పిగా ఉంటుంది. కొందరికి అదికూడా ఉండదు. మూతివంకర వచ్చిన తరువాత నరము దెబ్బతిన్నవైపు స్పర్శజ్ఞానము లేనట్లు వుంటుంది. ఆహారము తింటున్నప్పుడు-నమలి మ్రింగబోతే.... మింగుడు పడక బుగ్గల్లో నిలిచి వుంటుంది.

ఈ వ్యాధి వచ్చుటకు కారణము చెవులకు- చలిగాలి వేగముగా సోకడము లేదా ఎక్కువసేపు చలిగాలి సోకుటయే! నరము చెడిపోవుట, బ్రెయిన్‌తో కణితలు ఏర్పడుట లాంటివి కూడా కొన్ని కేస్‌లలో కారణాలౌతాయి.

మూతి వంకర వ్యాధి వచ్చినవారు నొప్పికి "అనాల్‌జిన్" బిళ్ళలు వాడుతూ, "కార్టికోస్టిరాయిడ్స్", యాంటీబయాటిక్ మందులు కోర్స్‌లు వాడాలి.

# కొన్ని రకముల విరేచనాలు - నివారణ

## ఉడుకు విరేచనములు

ఈ విరేచనములను వైద్య పరిభాషలో "సమ్మర్ డయేరియా" అని అంటారు. ఈ విరేచనాలు వేసవి కాలములో మాత్రమే ఔతాయి. ఇవి ప్రారంభించిన గంటా-రెండు గంటల కాలములోనే నాలుగు-ఐదు విరేచనాలు వెంట వెంటనే ఔతాయి. దీనివలన ఒంట్లో నీరంతా కోల్పోయి, కనుగ్రుడ్లు లోపలికి పీక్కుపోతాయి. నాలుక పిడచ కట్టుకుపోతుంది. విపరీతమైన జ్వరము వస్తుంది. ఈ ఉడుకు విరేచనాలు పెద్దలలో కంటే-పిన్నవారితోనే ఎక్కువగా, త్వరగా ప్రారంభమౌతాయి. ఈ విరేచనాలకు వెంటనే చికిత్స జరగాలి. నెలల పాపలకు వీటివలన చాల ప్రమాదము! వెంటనే వైద్యము జరుగకపోతే ప్రాణానికే ముప్పు రావచ్చును.

ఈ వ్యాధి రావడానికి "ఎలక్ట్రోలైట్ ఇంబాలెన్స్" ముఖ్య

కారణము ఐతే; "బాక్టీరియా క్రిములు", "ఫంగస్" కూడా కొన్ని సంద ర్భాలలో కారణము అగుటకు అవకాశమున్నది.

ఈ విరేచనాలు కొందరికి ఉధృతముగా వస్తాయి. కొందరికి ఒక మోస్తరుగా వస్తాయి. ఇవి కొందరిలో కొద్దిగా గట్టిగా (మలము) ఉంటే.... ఇంకొందరిలో చాల పలుచగా వుంటుంది. సాధారణముగా ఈ విరేచనాలలో పసరు ఎక్కువగా పోతుంది.

ఈ విరేచనాలు ఏ మాత్రము ఎక్కువగా వున్నా వెంటనే "సెలైన్" పెట్టి, "ఎలక్ట్రోలైట్స్" నరముల ద్వారా సెలైన్‌తో పంపిం చాలి. కొబ్బరినీళ్ళు, గ్లూకోజ్‌నీళ్ళు, ఉప్పునీళ్ళు చాల ఎక్కువగా ఇవ్వాలి. విరేచనాలు బాగా పోతున్న వారికి మందులు విడిగా ఇవ్వకుండా సెలైన్‌తోపాటే శరీరములోనికి పంపాలి.

విరేచనాలు ప్రారంభముకాగానే దగ్గరలో వున్న వైద్యశాలకు వెంటనే తీసికెళ్ళి, "పెక్టిన్". కైయోలిన్‌తో తయారైన మందులూ, "నియోమైసిన్"+"పెక్టిడిన్" కాంబినేషన్‌తో తయారైన మందులూ; జాగ్రత్తగా వాడి వీటిని నివారించాలి. ఉదా॥ పెక్టోకేబ్ (Pectokab) 30 ml పిల్లలకు; రినోకాబ్ (Renokab) బిళ్ళలు-లిక్విడ్; కాలిటిన్ విత్ నియోమైసిన్ (Kalitin with Neomycin), క్రియోమైసిన్ (Cremomycin) లిక్విడ్స్, ఫ్యూరాక్సోన్ (Furoxone) బిళ్ళలు-సస్పెన్షన్, కాన్‌సిన్ (Kancin) గొట్టములు మొ॥నవి.

## బంక-రక్త విరేచనములు (AMEBIASIS)

బంక, చీము, రక్త విరేచనాలతో కూడుకొన్న "అమీబియాస్" అనే వ్యాధి సూక్ష్మక్రిముల ద్వారా వస్తుంది. రోజులో 20 లేక 30 సార్లు ఈ విరేచనాలు పోతూ వుంటాయి. కడుపులో ప్రేగులు మెలికలు తిరిగి పోతున్నట్లుగా విపరీతమైన బాధగా వుంటుంది. ఈ విరేచనాలు రెండు లేక మూడు రోజులుండి మళ్ళీ తగ్గిపోతాయి. ఐతే.... తరువాత విరేచనము సాఫీగా కాకుండా మలబద్ధకము ప్రారంభమౌతుంది. మళ్ళీ

కొన్నాళ్ళకు రక్తము బంక, చీముతో విరేచనాలు ప్రారంభమై, విపరీతమైన చికాకును కలిగిస్తాయి. ఈ వ్యాధి వచ్చుటకు ముఖ్యమైన కారణము "ఎనమివాహిస్టోలిటికా" అనే ఏక కణజీవి: ఈ సూక్ష్మక్రిమి శరీరంలో ప్రవేశించిన రెండు-మూడు వారాలలోనే జిగురుతో కూడుకొన్న రక్త విరేచనాలు ప్రారంభమౌతాయి.

ఈ క్రిమి ఒక పట్టాన చచ్చిపోదు. ముఖ్యముగా ఇది సిస్ట్ రూపముగా మారిన తరువాత మందులు అంతంత మాత్రముగానే పని చేస్తాయి. "అమీబా" ప్రవేశించిన వారిలో 90% లివర్‌కు వ్యాధి సోకు తుంది. ఈ జీవి ఎక్కువకాలము శరీరములో నిలచి వున్నప్పుడు— మెదడు, ఊపిరితిత్తులకు కూడా వ్యాధి వస్తుంది. "అమీబియాస్" వ్యాధి సోకినవారికి పొత్తి కడుపులో కుడివైపు నొక్కితే విపరీతమైన నొప్పిగా వుండి, తరచు జ్వరము వస్తుంది. కొద్దిమందికి 'లివర్' పరిమాణము పెరుగుతుంది.

ఈ వ్యాధి సోకినవారు వెంటనే వైద్యుని సంప్రదించి, మలాన్ని పరీక్ష చేయించుకొని మెట్రొనెడాజోల్ (Metronidazole), ఫ్లాజిల్ (Flagyl) యూనిమెజాల్ (Unimezol), టినిడజోల్ (Tinidazol) బిళ్ళలు-సిరప్, ఇంజక్షన్‌లు; ఎంటొబెక్స్ (Entobex) ఎంబిప్లాన్ (Amdiplon) బిళ్ళలు-లిక్విడ్స్; "ఎమిటిన్"తో తయారైన ఎంబిస్ (Embis)- 15 mg బిళ్ళలు; "డిహైడ్రో ఎమిటిన్ (De-Hydro-Emetine)" బిళ్ళలు- 2 C C. ఇంజక్షన్ మొ॥గు మందులను జాగ్రత్తగా వాడాలి! ఈ వ్యాధిని నిర్మూలించకపోతే.... ముందు-ముందు చాలా అనర్థాలు వస్తాయి. ఈ వ్యాధి ఒకసారి వచ్చి పూర్తిగా తగ్గి పోయినా.... ఆహార- పానీయాల విషయములో చాల జాగ్రత్తగా, శుభ్రముగా వుండాలి,

## "అల్సరేటివ్ కొలైటీస్" (ULCERATIVE COLITIS) వ్యాధి వలన వచ్చే విరేచనములు

ఈ వ్యాధి వచ్చేవారికి ముఖ్యముగా ఉదరములో ప్రేగులు గడబిడగా వుంటాయి. ఏ కారణము లేకుండానే విరేచనాలు అగుట, బరువు తగ్గిపోవుట; విరేచనాలు-చీము-రక్తముతో కలసి నీళ్ళలాగా ఉండి, దుర్వాసనతో రోజు మొత్తములో 20 నుండి 40 ఔతాయి. క్రిముల వలన వచ్చిన విరేచనాలు- మందులు వాడితే తగ్గిపోతాయి. ఇవి మాత్రము కొన్ని మందులకు తగ్గినట్లు కనిపించినా ఏదైనా బాగా దిగులు, ఆలోచనా కలిగించే విషయాలు తటస్థిస్తే మళ్ళా పై మాదిరి గానే ప్రారంభమౌతాయి.

ప్రతి చిన్న విషయానికి విపరీతముగా ఆలోచించే వారికీ, బాగా ఆందోళనపడేవారికీ, బాధపడేవారికీ ఈ వ్యాధి త్వరగా వస్తుంది. మరో విషయము—సుమారు 20 ఏళ్ళ వయస్సు వారినుండి 40 ఏళ్ళ వయస్సు వారికి మాత్రమే ఈ మానసికమైన అశాంతి వలన వచ్చే "అల్సరేటివ్ కొలైటీస్" కనిపిస్తుంది. దీనికి వైద్య శాస్త్రజ్ఞులు మరికొన్ని కారణాలు కూడా చెబుతున్నారు. కొందఱికి సరిపడని కొన్ని ఆహార పదార్థాల వలన "ఎలర్జీ" కలిగి.... ఈ వ్యాధి రావచ్చును. ఇంకా.... "బాక్టీరియా" వలన "అమీబియాస్" అనే క్రిముల వలన కూడా వస్తుంది. ఈ వ్యాధి సోకిన వారికి రక్తము విపరీతముగా పోతుంది. నోట్లో పూత, శరీరములో నీరు లేకపోవుట, మనిషి క్షీణించుట, వీటికి తోడు జ్వరముకూడా వస్తుంది. ఈ వ్యాధిని నివారించుటకు సరైన మందులు పెద్దగా లేవనే చెప్పాలి. ఐతే.... అనుభవమున్న క్వాలిఫైడ్ డాక్టర్స్ వ్యాధి సోకిన వ్యక్తిని ఉత్సాహపఱచి, మెంటల్‌గా ఏ ఆలోచన లేకుండా చేసి, చాలా కేస్‌లలో విజయాన్ని సాధించారు. ఈ వ్యాధికి సాధారణముగా ట్రాంక్విలైజర్స్ (Tranquillizers) ఉదా॥ ఎస్కాజైన్ (Eskazine) 1 mg 5 mg బిళ్ళలు-ఇంజక్షన్లు మందులు మఱియు "కార్టిజోన్స్"తో తయారైన

మందులు, ఎనబాలిక్ స్టెరాయిడ్స్‌తో తయారైన మందులను వైద్యులు వినియోగించి కంట్రోల్ చేస్తారు.

# జీర్ణకోశములో వివిధ రకముల పాములు (క్రిములు) వాటి నిర్మూలన

## కొంకి పురుగు (HOOK-WORMS)

కాలికి ఏ అచ్ఛాదనా లేకుండా మురికి ప్రదేశాలలో నడిచినప్పుడు- యీ కొంకి పురుగులు అరికాలి చర్మాన్ని తొలుచుకొని, దేహములోనుండి శ్వాసకోశములోకి ప్రవేశించి మెల్ల మెల్లగా ఊపిరి గొట్టాల నుండి అన్న వాహికలోకి చేరుతాయి. తరువాత చిన్న ప్రేగులలోకి చేరి– అక్కడ శాశ్వత నివాసము ఏర్పాటుచుకొని, ఆ పరిసరాలలో వున్న రక్తనాళాలకు బెజ్జాలు పెట్టి- వాటి ఆహారమైన రక్తాన్ని త్రాగుతాయి. ఇవి త్రాగే రక్తము కొంచెమే ఐనా.... చాల రక్తము ఆ కన్నాలలో నుంచి అనవసరముగా పోతుంది. యీ పురుగుల వలన రక్తహీనత (ఎనీమియా) ఏర్పడే ప్రమాదము కూడా దగ్గరలోనే వుంటుంది. ఇవి కొంకిపురుగులుగా పూర్తి రూపము సంతరించుకొన్నాక... వీటి పరిమాణము దరిదాపు అర అంగుళానికి కొద్దిగా అటూ- ఇటూ ఉంటాయి.

మన శరీరములో వున్న రక్తమే ఆహారముగా త్రాగి బ్రతికే యీ కొంకి పురుగుల వ్యాధి వచ్చిన వారికి విపరీతమైన నీరసము- అలసట, ఏ కొంచెము నడచినా ఆయాసములతోపాటు రక్తము లేక వాలిపోవుట, కడుపులో పుండు ఉన్నట్లు నొప్పిగా ఉండుట; చిన్నపిల్లలకైతే ముఖము ఉబ్బుట, కడుపు ఎత్తుగా వుండి, కాళ్ళకు- పొట్టకు నీరు చేరినట్లుగా లక్షణాలు కలిగి ఉంటారు.

పై లక్షణాలు కలిగినవారు డాక్టర్‌ను సంప్రదించి- వారు సూచించి నట్టుగా "మల" పరీక్ష చేయించుకొని, కొంకి పురుగులను నాశనము చేయుటకు డెకారిన్, పాస్టెల్మిన్, మెబెక్స్‌లాంటి మందులు; పిప్రాజైమ్ సిట్రేట్+ఎడిపేటే+హెక్స్ హైడ్రేట్+డై ఎటిల్ కార్బామా

జైన్+డైథియాజా కాంబినేషన్‌తో తయారైన మందులను వాడాలి. ఉదా॥ నియోబెడర్‌మిన్ (Neo-Bedermin) గొట్టములు; "ఆల్కోపార్ (Alcopar)" పలుకుల మందు; "టెట్రాకేప్ (Tetracap)" గొట్టములు మొ॥నవి.

కోల్పోయిన రక్తాన్ని తిరిగి సమకూర్చుకొనుటకు 'ఐరన్' టానిక్స్-బిళ్ళలు; ప్రొటీన్స్ కొఱకు వాటికి అనుగుణమైన మందులు, ఆహారము వాడాలి. యీ వ్యాధి మరలా రాకుండా ఉండుటకు పరిసరాలను పరిశుభ్రముగా ఉంచుకొనుటయేగాక.... కాలికి చెప్పులు వేసుకొనుట లాంటి అలవాట్లను పెంచుకొని, పైన చెప్పిన లక్షణాలు కనిపించగానే వెంటనే మలపరీక్ష చేయించుకొని తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

## బద్దె పురుగులు (TAPE WORMS)

యీ బద్దె పురుగులను "బద్దె పాము"లని కూడా అంటాయి. ఇవి చాల ప్రమాదకరమైనవి. ఇవి పంది, గొడ్డులాంటి మాంసాహారములు తినే వారిలోనే అధికము (90%)గా ఉంటాయి. బద్దె పురుగులు కడుపులోకి జేరి.... పెద్ద ప్రేగుల గోడలను అంటిపెట్టుకొని రక్తాన్ని త్రాగి జీవిస్తాయి. ఇవి మామూలు పాములకంటే పొడవుగా కూడ ఉంటాయి. బద్దె పురుగులు పూర్తిరూపము సంతరించుకున్న తరువాత వీటి పొడవు సుమారు 1 మీటర్ నుండి 3 మీటర్స్ వఱకు ఉంటాయి. అరుదుగా కొంతమందిలో ఇంకా బాగా పొడవుగా కూడా ఉండవచ్చును. వీటివలన చిన్న చిన్న చికాకు కలిగించే విషయాలు తక్కువేకాని; అడపా-తడపా విరేచనాలు, కడుపులో విపరీతముగా నొప్పి ఉంటుంది. వీటి గ్రుడ్లు దేహములో ప్రవేశించినప్పుడు ఒళ్ళంతా నలుపుగా ఉంటుంది. అలాగే గ్రుడ్లు మెదడుకు చేరితే.... అక్కడ 'కణితి' తయారై దీనివలన మూర్ఛ వ్యాధిలో లాగా "ఫిట్స్" వచ్చుటకు అవకాశము ఉన్నది. "టీనియా", "సజైనాటా" అనే బద్దె పురుగులను నిర్మూలించుటకు మందులు వాడినప్పుడు- ఇవి చిన్న చిన్న ముక్కలుగా తెగి మలముద్వారా బయట పడతాయి. ఐతే దీని తల మాత్రము ప్రేగుల నంటిపెట్టుకొనే ఉండి

పోతుంది. ఈ చిన్న తల మరలా విస్తారముగా అంటే.... పైన చెప్పు కొన్నట్లు 1-3 మీటర్ల పొడవు పూర్తిరూపము పెరుగుతుంది.

పట్టభద్రులైన వైద్యుల పర్యవేక్షణలో.... సరియైన మందులు వాడనిదే పూర్తి పాము బయటకు రాదు. దీనికి "జంతువాత నివారణ (Anthelmintics)" మందులు వాడితే సమూలముగా నాశనమౌతుంది. ఉదా॥ క్రిస్టాయిడ్స్ (Crystoids) లిక్విడ్; విస్టాపిల్ (Vistannyl) బిళ్ళలు మొ॥నవి.

## ఏలిక పాములు (ROUND WORMS)

ఏలికపాములున్న వారికి కడుపులో విపరీతముగా నొప్పి ఉండి కొన్ని సార్లు "ఫిట్స్" కూడా రావచ్చు. దరిదాపుగా ఇవి ఆఅంగుళాల నుండి 10-15 అంగుళాల పొడవు వరకు ఉంటాయి. వీటినే వైద్యులు "యుస్కారిస్-లుంబ్రికాయిడ్స్" అంటారు. ఇవి వానపాము (ఎఱ) లాగా గుండ్రముగా ఉంటాయి. ఏలికపాములు చిన్న ప్రేగులలో బొడ్డు ఉండే చోట నివాసము ఏర్పరచుకొంటాయి. ఇవి కడుపులో వున్న వారికి బొడ్డు ప్రాంతములోనే విపరీతముగా నొప్పి వుంటుంది. ఈ ఏలిక పాములు పిల్లలలోనే ఎక్కువగా వుంటాయి. ఇవి ఉన్న వారికి ఆకలి వుండదు. అప్పుడప్పుడు విరేచనాలౌతాయి. ఎంత ఎక్కువగా తిన్నా.... నీరసముగా వుంటుంది. ఏలిక పాములు ఆడ- మగ కలిసే జీవిస్తాయి. మనము తిన్న ఆహారాన్ని ఇవి తినేస్తాయి. కాబట్టి పిల్లలు బలహీనముగా వుంటారు. అప్పుడే పుట్టిన చిన్న చిన్న పాములు శ్వాసకోశములోనికి ప్రవేశించి నప్పుడు ఛాతిలో నొప్పిగా వుండి దగ్గు, దగ్గుతోపాటు రక్తము పడుతుంది. పొట్టలోపల ఈ పాములున్నప్పుడు కొద్దిమందికి "ఎలర్జీ" వలన శరీర మంతా దద్దురులు కూడా రావచ్చు, మరికొందఱిలో "ఈసినోఫిలియా" కనిపిస్తుంది. ఇంకొందఱిలో వికారముతోపాటు వాంతులై....నోటిలో నుండి అరదుగు-అడుగు సైజ్‌లో వుండే పాములు కొన్ని పడతాయి. కొందఱికి యీ పాములున్నప్పటికీ పైన చెప్పిన లక్షణాలేవి కనిపించకపోవచ్చు.

"రౌండ్-వర్మ్స్" వున్న వారికి "పైపరజైన్ (Piperazine)"

మందులను వాడాలి. ఉదా॥ యాంటిపార్ (Antepar) బిళ్ళలు-పొడి-సిరప్; హెల్మాసిడ్ (Helmacid) పొడి; "అల్కొపార్" పలుకుల మందు మొ॥నవి.

## నులి పురుగు (PIN-WORMS)

ఇవి చేరిన వారికి- ఆకలి లేకపోవుట; నలతగా వుండుట, తిన్నది సరిగా ఒంటబట్టకపోవుట లాంటి లక్షణాలు కనిపిస్తాయి. యీ నులి పురుగులు సాధారణముగా బాగా పెరిగితే.... గుండు సూది అంత సైజ్ వుంటాయి. మామూలుగా ఐతే.... అర అంగుళము లేక పావు అంగుళము సైజ్ కుమించకుండా వుంటాయి. ఇవి ఒక విరేచనములోనే వేల సంఖ్యలో కనబడతాయి. వీటిని నివారించుటకు "లెవమిసోల్ (Levamisole)" మందులను వైద్య పర్యవేక్షణలో వాడాలి. ఉదా॥ : వెర్మిసోల్ (Vermisol) బిళ్ళలు-సిరప్, కెట్రాక్స్ (Ketrax) బిళ్ళలు, విజోల్ (Vizole) కాప్స్యూల్స్-సిరప్ మొ॥నవి.

## కలరా (CHOLERA) నివారణ

యీ "కలరా" అనే మహమ్మారి దరిదాపుగా ఇప్పుడు చాల తక్కువనే చెప్పవచ్చు. పూర్వము యీ వ్యాధి సోకి గ్రామాలకు- గ్రామాలే తుడిచి పెట్టుకుపోయేవి. యీ వ్యాధి వచ్చుటకు ఒక విధమైన బాక్టీరియా (Viblo-Cholera) క్రిములే కారణము! యీ క్రిములు శరీరములో ప్రవేశించిన 4 లేక 8 గంటలు వ్యవధిలోనే యీ జబ్బు బయటపడుతుంది. కొందరికి రెండు - మూడు రోజులు కూడా పట్టవచ్చును. మామూలుగా వేసవికాలములో వచ్చే విరేచనాలకు, కలరావ్యాధి సోకిన వారికి వచ్చే విరేచనాలకు ఒక ముఖ్యమైన తేడా వున్నది. యీ వ్యాధిలో విరేచనాలు ప్రారంభమైనప్పుడు మొదటిసారిగా అయ్యే విరేచనము చాల ఎక్కువగా అంటే రోజూ మనము విసర్జించే దానికన్నా 3 లేక 4 రెట్లు ఎక్కువగా వుంటుంది. రెండవది కూడా ఇంచుమించు అదే పరిమాణములో వుండి; తదుపరి మాత్రము కేవలము వట్టి నీటి విరేచనాలు మాత్రమే ప్రెషర్ పంప్ కొట్టినట్లుగా ఔతుంటాయి. వాంతులు కూడా వట్టి నీరులాగా మాత్రమే వస్తాయి. వాంతుల వలన ఎలాంటి వికారము

కడుపులో వుండదు. విరేచనాలకు కూడా ఎలాంటి కడుపునొప్పి అని పించదు. ఈ కలరా విరేచనాలు చూచుటకు బియ్యము కడుగు నీళ్ళలాగ తెల్ల తెల్లగా వుంటాయి.

కలరా వ్యాధి ప్రారంభమైన కొద్ది సేపటిలోనే రోగి యొక్క శారీరక స్థితి వికటిస్తుంది. వెంటనే వైద్య పర్యవేక్షణలో నరాలకి 'సెలైన్' ఎక్కించాలి. సరిపోయినంత నీరు శరీరానికి అందిన తర్వాత నోటి ద్వారా పండ్ల రసములు, గ్లూకోజ్, కొబ్బరి నీరు మొ॥నవి. ఇస్తుండాలి. "సల్ఫా" మరియు ఇతర కాంబినేషన్‌తో తయారైన మందు లను వాంతులు తగ్గిన వెంటనే.... నోటిద్వారా ఇవ్వాలి. ఉదా॥ సల్ఫో సిన్ (Sulfocin) బిళ్ళలు; బాసిప్లాన్ (Basiplon) గొట్టాలు-సిరప్; క్లోరోసల్ఫ్ (Chiorosulf) బిళ్ళలు-సిరప్ మొ॥నవి.

"యాంటీబయాటిక్" మందులు కూడా సరియైన మోతాదులలో సరియైన టైమ్‌కే వాడాలి. ఉదా॥ : టెట్రాసైక్లిన్, సైక్లోసిటిన్ (Cyclo-cetin) మొ॥నవి.

## మొలలు (PILES) - నివారణ

ఈ మొలల వ్యాధి రక్తనాళపు గోడలు పలుచగా వున్న వారికే ఎక్కువగా వుంటుంది. మల విసర్జనకు ముక్కుట వలన, మలబద్ధకము వలన- మొలలు తయారౌతాయి. స్త్రీలు గర్భిణితో వున్నప్పుడు మొలలు బయటపడి తర్వాత తగ్గిపోతాయి. ఇవి వచ్చుటకు ముఖ్యమైన కారణము రక్తనాళాలు ఉబ్బి, సాగటము! దీనితో మొలలు పెరుగుతాయి. కొంద రికి వంశానుగతముగా కూడా ఈ వ్యాధి వస్తుంది.

ముఖ్యముగా మొలలను మూడు దశలుగా విభజించవచ్చును. మొదటి దశలో మొలలు కనపడకుండా మలవిసర్జన చేసేటప్పుడు రక్తము బొట్లు బొట్లుగా పడుట తప్ప ఎటువంటి బాధ వుండదు. ఈ దశలో "మొలల మందులు (Antihemorrhoids)" వైద్య పర్యవేక్షణలో వాడి నివారించవచ్చును. ఉదా॥ : పైలెక్స్ (pilex) బిళ్ళలు-ఆయింట్ మెంట్, పైలాన్ (Pilon) బిళ్ళలు, జైలోకైన్ జెల్లి (Xylocine Jelly) మల ద్వారానికి పూతమందు మొ॥నవి.

ఇక రెండవదశలో ఈ రక్తనాడులు ఉబ్బి, పెద్దవిగా తయారై విరేచన సమయములో ఇవి కూడా మలముతో పాటుగా బయటకువచ్చి మెత్తని బొడుములాగా చేతికి తగులుతాయి. కొద్దిసేపటిలో మరలా ఇవి లోపలికి వెళ్ళిపోతాయి.

మూడవదశలో మొలలు మలవిసర్జనతో ఎటువంటి సంబంధము లేకుండానే మల ద్వారమునుండి బయటకువచ్చి, తడవ- తడవకూ చిట్లి పోతూ విపరీతముగా రక్తము కారుట, చీముపట్టుట, వాసన వచ్చుట వంటివేకాక-రోగి విపరీతమైన బాధలకు గురౌతాడు.

మొదటి దశలో ఐతే.... మందులతో మొలలలు పెరుగకుండా, చిట్లకుండా, మల విసర్జన తేలికగా అగుటకు లిక్విడ్ పారాఫిన్ లాంటివి వాడి నిరోధించవచ్చు! కానీ-రెండవదశ, మూడవదశలలో ఇది దాదాపు అసాధ్యమే? ఈ సమయములో శస్త్ర చికిత్సా నిపుణులను సంప్రదించి, వీటిని శాశ్వతముగా నిర్మూలించుకోవాలి! కొంతమందివాడే- నాటు మందులు, మంత్రాలకు ఇవి తగ్గకపోగా.... లేనిపోని క్రొత్త వ్యాధులు ప్రారంభమగును.

## ఈసినోఫిలియా (EOSINOPHILIA) - నివారణ

"ట్రాపికల్ పల్మొనరీ ఈసినోఫిలియా" అని పిలువబడే యీ వ్యాధి-దోమకాటు ద్వారా ప్రవేశించే.... "ఫైలేరియా" అనే సూక్ష్మ క్రిములద్వారా సంక్రమిస్తుంది. యీ వ్యాధి వచ్చినవారికి దగ్గుతోపాటు- పిల్లికూతలు, ఆకలి లేకపోవుట, ఛాతిలో నొప్పి, అలసట, అయాసము, గొంతులో గుఱ గుఱ, తలబరువు, తలనొప్పి, ఛాతి బిగపట్టి ఊపిరి- అందనట్లు బాధ మొదలగు లక్షణాలు ఒక్కొక్కరికి ఒకో విధముగా ఉంటాయి. మరికొందరికి ఒళ్ళంతా దద్దురులు కూడా రావచ్చు.

ఈ వ్యాధి సోకినవారు రక్తపరీక్ష చేయించుకొని "ఫైలేరియా"కి మందులు వాడాలి. ఉదా॥ "హెట్రాజన్" (Hetrazan) బిళ్ళలుగాని, "బానోసైడ్" బిళ్ళలుగాని రోజుకు 6 బిళ్ళల చొ॥న 15 రోజులువాడాలి,

పై మందులతో "కార్టిజోన్" మందులుకూడా జాగ్రత్తగా వాడాలి! ఉదా॥ కార్టిసన్ (Cortison) ఇంజక్షన్స్; కార్టోన్ (Cortone) బిళ్ళలు మొ॥నవి.

డాక్టర్ పర్యవేక్షణలో "యాంటిహిస్టమిన్" మందులను కోర్స్‌గా వాడి మంచి ఫలితాలను సాధించవచ్చు.

### ప్రయాణములో వాంతులు-నివారణ

కొందఱికి బస్, రైల్, విమానము మొ॥లగు వాహనాలలో ప్రయాణము చేస్తే వాంతులు ఔతాయి. దీనికి కారణము చెవిలోపల వుండే "సెమిసర్క్యులర్ కెనాల్స్"- వాహన ప్రయాణ సమయములో.... విపరీతమయిన ఒత్తిడికి గుఱై.... ఈ "రిఫ్లెక్స్ యాక్షన్" వలన కొందఱికి వాంతులు ఔతూ ఉంటాయి. ఈ లోపము ఉన్నవారికి విడిగా చెవుల వలన ఏ ఇతర ఇబ్బంది ఉండదు. మామూలుగానే ఉంటారు. ఇంకొందఱికి-జీర్ణాశయము- ప్రేగుల యొక్క విపరీతమైన కదలికల వలన: మరి కొందఱికి-పెట్రోల్ వాసనలు పడక వికారము—వాంతులు రావచ్చును.

ఇలా ప్రయాణములో వాంతులయ్యేవారు ప్రయాణానికి ముందుగా "యాంటి-ఎమిటిక్స్" (Anti Emetics) వేసికొని బయలుదేరితే వాంతులు రావు. ఉదా॥ "ఎవోమిన్ (Avomine)" బిళ్ళలు; 'గ్రావాల్' బిళ్ళలు; "ఎస్కాజైన్" (Eskazine) బిళ్ళలు మొ॥నవి.

# కళ్ళవ్యాధులు - నివారణ

### ఆశ కురుపులు (STY)

కను ఱెప్పలలో చాల చిన్నవిగా ఉండే "జీస్" గ్రంధులు వాచుట వలన కంటిఱెప్ప అంతా వాచి, లాపై కనుఱెప్పలమీద మినుపగింజంత కుఱుపు లేస్తుంది. ఇటువంటివి అప్పుడప్పుడు వచ్చి తగ్గిపోతూ ఉంటాయి. ఇలా వచ్చుటకు ముఖ్యమైన కారణము "బాక్టీరియా క్రిము"ల వలన

"జీన్" గ్రంధులు జబ్బులో పడుటయే! ఈ వ్యాధి వయస్సులో ఉన్న వారికే ఎక్కువగా వస్తుంది.

ఈ వ్యాధి ఇలా తరుచుగా వచ్చేవారు "యాంటీబయాటిక్" మందులువాడి ఆళ కుఋపులను నిర్మూలించాలి. ఉదా॥ "టెట్రామైసిన్" బిళ్ళలు-ఇంజక్షన్స్; "పెనిసిలిన్" బిళ్ళలు-ఇంజక్షన్స్; నొప్పికి-ఐబుబిడ్ (Idudid) బ్రూఫెన్ (Brufen) బిళ్ళలు మొదలగునవి.

## కళ్ళకలక

"కంజంక్టివైటిస్" అనే ఈ కళ్ళ కలక వ్యాధి ఒకరికివస్తే.... ఆ కుటుంబములో అందరికి అంటుకొంటుంది. ఒక విధమైన "వైరస్" క్రిముల వలన కంటికి ఈ వ్యాధి వస్తుంది. ఇది సోకిన వారికి ముందు ఒక కంటికివచ్చి, తరువాత రెండవ కంటికి వస్తుంది. ఈ కళ్ళకలక వచ్చినవారు వాడిన దుస్తులు, వస్తువులకు ఇతరులు దూరముగా ఉండాలి.

Viral Conjunctivitis 3-4 రోజులుండి తగ్గిపోతుంది. దీని వలన ఇతర ఇబ్బందులేమి అంతగా ఉండవు. కాకపోతే.... ఇది తగ్గేంత వలకు కళ్ళకు మంట- బాధ ఎక్కువగా ఉంటాయి.

కళ్ళకు కలక వచ్చినవారు "టెట్రామైసిన్", "సోప్రామైసిన్" మొ॥లగు కంటి ఆయింట్‌మెంట్‌లు, డ్రాప్స్ వ్యాధి తగ్గేంతవలకు వాడాలి. "యాంటీబయాటిక్స్" కూడా వాడాలి.

## శుక్లాలు (CATARACT)

కంటిలోపల ఉండే "లెన్స్" కొన్ని కారణాల వలన తన సహజత్వాన్ని కోల్పోయి గట్టిపడి, తెల్లగా మారుట జరుగుతుంది. శుక్లాలు దరిదాపుగా 45 నుండి 50 సంవత్సరాలు దాటిన వారిలోనే కనపడతాయి. అరుదుగ కొందరిలో పుట్టుకతోనే శుక్లాలు మొదలై, పది సంవత్సరాల వయస్సులోపే చూపు కనపడని పరిస్థితి ఏర్పడుతుంది. ప్రారంభంలో ఈ శుక్లాలు ఉన్నవారికి దూరపు వస్తువులు కనబడుట ఉండదు. తరువాత నిదానముగా చూపు మందగించుట పెరిగి, అర్థ

గజము దూరములో ఉన్న వస్తువులుకూడా కనిపించకుండా పోతాయి. యీ శుక్లాలు ఏ కారణము వలన వస్తాయో స్పష్టమైన కారణాలు ఇంకా తెలియక పోయినా.... కొందరిలో మాత్రము కారణాలు కనిపిస్తాయి.

"కాటరాక్ట్" వచ్చినవారు విధిగా నేత్రవైద్యుని సంప్రదించి, శస్త్ర చికిత్స చేయించి దీనిని తొలగించాలి. అంతేగాని ఏ విధమైన మందులకు ఇది కరిగిపోదు. అంతేకాదు.... యీ వ్యాధిని ముదరపెడితే "Glancoma" మొదలగు కాంప్లికేషన్స్ వలన శాశ్వతముగా అంధత్వము వస్తుంది. కాబట్టి కంటివిషయములో ఎవరైనా అత్యంత జాగ్రత్తగా ఉండాలి!

## కళ్ళవాపు (TRACHOMA)

కళ్ళకు యీ "ట్రకోమా" అనే వ్యాధి వచ్చుటకు ఒక విధమైన "వైరస్" కారణమౌతుంది. యీ సూక్ష్మక్రిములు కంటిలో ప్రవేశించిన మూడు- నాలుగు రోజులలోనే యీ వ్యాధి లక్షణాలు బయటపడతాయి. కనుతెప్పలు పైకెత్తిచూస్తే చెమట గుల్లలంత చిన్న చిన్న పొక్కులు కొన్ని ఉంటాయి. వీటినే వైద్య పరిభాషలో "Fllicle" అని అంటారు. యీ వ్యాధి రెండుకళ్ళలోనూ వస్తుంది. అంతేకాదు ఇది అంటువ్యాధి కూడా!

యీ వ్యాధి ఉన్నవారికి వెలుతురుచూస్తే కళ్ళవెంట నీరువస్తుంది. నీరు ఎక్కువగా కనుతెప్పలు నలుపుకుంటారు. కొన్నాళ్ళకు కనులు, తెప్పలు బరువుగా ఉంటాయి. పై తెప్పలు మూసుకోలేక సగము కన్ను ఎప్పుడూ తెరుచుకునే ఉంటుంది యీ వ్యాధి ఉన్నవారు వెంటనే చికిత్స చేయించుకోకపోతే.... పై లక్షణాలన్నీ విపరీత స్థాయిలో వస్తాయి.

యీ వ్యాధి కలవారు "నల్ఫా" బిళ్ళలు; "టెట్రాసైక్లిన్" కంటి మందులువాడి తేలికగా యీ ట్రకోమా వ్యాధిని తగ్గించుకోవచ్చును. ఉదా॥ కార్టోలో (Cortolo) ఐ-డ్రాప్స్; బెట్నెసాల్ (Betnesol) ఐడ్రాప్స్; మెడాసిన్ (Mydacin) ఐ-ఆయింట్‌మెంట్ మొ॥నవి.

చలి వేస్తుంది. కొందఱికి పెద్ద వాంతి ఔతుంది. ఇది చలి-జ్వరముతో వచ్చుట వలన కొందఱు దీన్ని "మలేరియా జ్వరము" అనికూడా భ్రమ పడతారు. జ్వరముతోగాని, జ్వరము వచ్చిన తరువాతగాని గొంతు నొప్పి బయలుదేరుతుంది. పొడిదగ్గు, జలుబు వస్తుంది. దగ్గువలన ఛాతిలో మంట-నొప్పి వస్తాయి. మాట బొంగురుగా వస్తుంది. "ఇన్ఫ్లూయెంజా" వచ్చిన కొందఱికి కడుపులో వికారముగా ఉండి ఏమీ తినుట, త్రాగుట లాంటివి చేయబుద్ధికాదు.

ఇంతాచేసి ఈ జ్వరము రెండు మూడు రోజులలో తగ్గిపోతుంది. కానీ– ఇది వచ్చివెళ్ళిన 10, 11 రోజుల వఱకు నిస్సత్తువగా ఉండి; ఏ పని చేయుటకైనా ఓపికలేక నీరసించిపోతారు.

ఈ జ్వరము వచ్చినవారు వైద్య పర్యవేక్షణలో జ్వరము తగ్గుటకు ఒళ్ళునొప్పులు తగ్గటానికి యాంటీబయాటిక్ బిళ్ళలు వాడాలి. బాగా నీరసముగా ఉన్న వారికి పండ్లరసము, మజ్జిగ, బి-కాంప్లెక్స్ బిళ్ళలు వేసికొంటే నీరసము కొన్నిరోజులలో తగ్గిపోతుంది. ఎక్కడో నూటికి-కోటికి ఒకరికి ఈ వ్యాధి కలిగించే క్రిములు మెదడుకు సోకి "వైరల్ మెనిన్జైటిస్" అనే వ్యాధి సంక్రమిస్తుంది. ఎక్కువ మందికి ఈ జ్వరము ఎటువంటి దుష్ఫలితాలు లేకుండానే తగ్గిపోతుంది.

## ఎలుకలు కొఱికితే వచ్చే జ్వరము

"స్పైరిల్లమ్ మైనస్" అనే సూక్ష్మక్రిములు ఎలుకలలో ఉండి.... అవి కాటు వేసినప్పుడు- మన శరీరములో ప్రవేశించి ఈ జ్వరాన్ని కలిగిస్తాయి. ఈ జ్వరము వచ్చేముందు వాంతులు- వికారము, చెమట పట్టును. తలనొప్పి; దేహమంతా పోట్లు ఉంటాయి.

ఈ జ్వరము ఎలుకలు కఱచిన 10 రోజులనుండి 60 రోజుల లోపు ఎప్పుడైనా రావచ్చు. ఈ జ్వరాన్ని "మలేరియా జ్వరము"గా భావించే వారుకూడా ఉన్నారు. ఎందుకంటే ఈ జ్వరము వచ్చేటైమ్‌కి సాధారణముగా ఎలుక కఱచిన గాయము మానిపోతోంది. కాబట్టి ఎలుక వలన జ్వరము వచ్చినదని భావించలేరు. ఈ క్రిములు ఒక్కోసారి రక్త పరీక్షలో కూడా కానరావు. ఎలుక కఱిస్తే వచ్చే యీ జ్వరము 4 రోజు

లంటే నాలుగు రోజులు ఉండదు. కానీ జ్వరము వచ్చేముందు చలి ఉంటుంది. ఈ వ్యాధి సోకినవారు వైద్య పర్యవేక్షణలో "పెనిసిలిన్" ఇంజక్షన్ లేదా "టెట్రాసైక్లిన్" క్యాప్సూల్స్‌వంటి, 'యాంటీబయాటిక్స్' పది రోజులపాటు ఉదయము, సాయంత్రము వాడితే జ్వరము తగ్గిపోతుంది.

## జ్వరములో తీసుకోవలసిన జాగ్రత్తలు

జ్వరము వచ్చినవారికి ఒంటిమీద ఉన్న దుస్తులను తీసివేసి, శరీరమంతా చల్లనిగుడ్డ కప్పాలి. తడి ఆరకుండా ఆ గుడ్డమీద ఎప్పుడూ చల్లటినీరు చల్లుతూ ఉండాలి. త్రాగుటకు ఎప్పుడూ చల్లటి నీళ్ళుగానీ, గ్లూకోస్ నీళ్ళుగానీ, కొబ్బరి నీళ్ళుగానీ విపరీతముగా ఇవ్వాలి. బాగా గాలివచ్చే ప్రదేశములో పడుకోబెట్టి ఎప్పుడూ విసరుతూ ఉండాలి. (ఫ్యాన్ గాలి అయినా ఫరవాలేదు) తరువాత క్రోసిన్‌గానీ, మెటాసిన్ గనీ, ఆస్ప్రిగానీ ఒకటి-రెండు బిళ్ళలు వేసి బాగా విశ్రాంతిని ఇవ్వాలి. జ్వరము తగ్గితే తడిగుడ్డ తీసివేసి, ప్రతి అరగంటకూ ఒకసారి తడిగుడ్డతో దేహమంతా తుడుస్తూ ఉండాలి. ఇలాచేస్తే.... జ్వరము చాల వరకు తగ్గిపోతుంది.

## గౌట్ (GOUT) వ్యాధి-నివారణ

GOUT : సహజముగా 30 సం॥ల పైబడి స్థూలముగా వున్న వారిలో ఈ వ్యాధి కనిపించవచ్చు. కొందరిలో రక్తపోటు, సుగర్‌వలె వంశ పారంపర్యముగా కూడా ఇది రావచ్చు. ఈ జబ్బు సోకిన వారికి హఠాత్తుగా కాలి బొటనవ్రేలు విపరీతమైన నొప్పిగా ఉంటుంది. ఈ నొప్పి రాత్రులయందు నిద్రలో వస్తుంది. కొన్ని గంటలలో బొటన వ్రేలు విపరీతముగా వాచి, కందిపోతుంది. కాలు కదిపినా భరించ లేనంత నొప్పి ఉంటుంది. కాలి బొటనవ్రేలు మాత్రమే వాచి ఈ జబ్బుకు జ్వరముకూడ కొంచెము ఉంటుంది. ఈ జబ్బు రావడానికి మాంసకృత్తులలో "ప్యూరిన్ మెటబాలిజమ్" లోపించటమే ముఖ్యమయిన కారణము! అరుదుగా కొందరికి మిగిలిన వ్రేళ్లు కూడా వాస్తాయి. మరి కొందరికి మాత్రము కాళ్ల-చేతులకు సంబంధించిన

కీళ్ళవాపులు ఒకసారే వచ్చి, తగ్గకుండా.... మళ్ళీ-మళ్ళీ వచ్చి భరించ లేనంత నొప్పిని కలిగిస్తాయి.

ఈ వ్యాధి ఇలా వచ్చిపోతుంటే కాలి బొటనవ్రేలే కాకుండా ఆ కాలి మడమ, చేతియొక్క మణికట్టు, మోకాలు, మోచేయి, తుంటి, గూడలయొక్క కీళ్ళు-ఎముకలు పాడై పోతాయి. ఈ వ్యాధి సోకినవారిలో కొద్దిమంది మాత్రము జీవితాంతము బాధలు పడుతూనే వుంటారు. ఈ వ్యాధి ముదిరిన వారికి మూత్రపిండాలు కూడా దెబ్బతినే అవకాశము చాల దగ్గరగా ఉంటుంది. గౌట్ సోకిన వారికి "యూరిక్ యాసిడ్" తొమ్మిది mg. కంటే పెరుగకుండా చూడాలి. "ప్యూరిన్" ఎక్కువగా వుండే పదార్థాలు- అంటే తియ్యని రొట్టె, చేపలు, జంతువుల మూత్ర పిండాలు- కార్జము- కాలేయము, మద్యపానము- మాదకద్రవ్యాలు మొ॥నవి పూర్తిగా విసర్జించాలి. మంచి వైద్యుల పర్యవేక్షణలో ఎనాల్ జిసిక్ (Anaigesic)తో తయారైన మందులను జాగ్రత్తగా వాడవలెను. ఉదా॥ : తరుణదశలో కోల్చిసిన్ (Colchicine), ఐడిసిన్ (Idicin) బిళ్ళలు, ఆర్టిరాన్ (Artiaan), గొట్టాలు— మందులు; సాల్సిలేట్స్ మందులు; ఫినిల్ బుటాజోన్ (Phenyl butozone).

## బెల్స్‌ఫాల్సీ (మూతి వంకర వ్యాధి)

వైద్య పరిజ్ఞానము లేనివారు దీనిని "గ్రహణము పోయింది" అని, "పక్షవాతము వచ్చింది" అని అంటుంటారు. పల్లెలలో ఐతే కొందరు తెలియక ఈ వ్యాధికి పావురాల రక్తము పూస్తారు. మరి కొందరు దీన్ని వాతనొప్పిగా భావించి విరేచనాలకు గుళికలు కూడా మ్రింగుతుంటారు.

ఇలా మూతి వంకర పోవుటకు కారణము చెవిపైన ఉండే "ఫేషియల్‌నర్వ్" ఒత్తిడికి గురి అగుటయే ఈ "బెల్స్‌ఫాల్సీ" జబ్బుకు మూతి మాత్రమే వంకరపోతుంది. కాని కొందరు అనుకొనేటట్లు కాళ్ళు-చేతులు పక్షవాతానికి గురి అయ్యే ముందుగా ఇలా జరుగదు. దానికి దీనికి అసలు సంబంధమే లేదు. ఇది ఒక ప్రత్యేకమైన వ్యాధిమాత్రమే!

మూతి వంకర కలిగించే ఈ నరముల వ్యాధి రావడానికి రెండు రోజుల ముందుగా రెండు చెవులలో ఒకదాని వెనుక నొప్పిగా ఉంటుంది. కొందరికి అదికూడా ఉండదు. మూతివంకర వచ్చిన తరువాత నరము దెబ్బతిన్నవైపు స్పర్శజ్ఞానము లేనట్లు వుంటుంది. ఆహారము తింటున్నప్పుడు-నమలి మ్రింగబోతే.... మింగుడు పడక బుగ్గల్లో నిలిచి వుంటుంది.

ఈ వ్యాధి వచ్చుటకు కారణము చెవులకు- చలిగాలి వేగముగా సోకడము లేదా ఎక్కువసేపు చలిగాలి సోకుటయే! నరము చెడిపోవుట, బ్రెయిన్‌తో కణితలు ఏర్పడుట లాంటివి కూడా కొన్ని కేసులలో కారణాలౌతాయి.

మూతి వంకర వ్యాధి వచ్చినవారు నొప్పికి "అనాల్జిన్" బిళ్ళలు వాడుతూ, "కార్టికోస్టిరాయిడ్స్", యాంటీబయాటిక్ మందులు కోర్స్‌లు వాడాలి.

# కొన్ని రకముల విరేచనాలు - నివారణ

## ఉడుకు విరేచనములు

ఈ విరేచనములను వైద్య పరిభాషలో "సమ్మర్ డయోరియా" అని అంటారు. ఈ విరేచనాలు వేసవి కాలములో మాత్రమే ఔతాయి. ఇవి ప్రారంభించిన గంటా-రెండు గంటల కాలములోనే నాలుగు-ఐదు విరేచనాలు వెంట వెంటనే ఔతాయి. దీనివలన ఒంట్లో నీరంతా కోల్పోయి, కనుగ్రుడ్లు లోపలికి పీక్కుపోతాయి. నాలుక పిడచ కట్టుకుపోతుంది. విపరీతమైన జ్వరము వస్తుంది. ఈ ఉడుకు విరేచనాలు పెద్దలలో కంటే- పిన్నవారితోనే ఎక్కువగా, త్వరగా ప్రారంభమౌతాయి. ఈ విరేచనాలకు వెంటనే చికిత్స జరగాలి. నెలల పాపలకు వీటివలన చాల ప్రమాదము! వెంటనే వైద్యము జరుగకపోతే ప్రాణానికే ముప్పు రావచ్చును.

ఈ వ్యాధి రావడానికి "ఎలక్ట్రోలైట్ ఇంబాలెన్స్" ముఖ్య

కారణము ఐతే; "బాక్టీరియా క్రిములు", "ఫంగస్" కూడా కొన్ని సంద ర్భాలలో కారణము అగుటకు అవకాశమున్నది.

ఈ విరేచనాలు కొందఱికి ఉధృతముగా వస్తాయి. కొందఱికి ఒక మోస్తరుగా వస్తాయి. ఇవి కొందఱిలో కొద్దిగా గట్టిగా (మలము) ఉంటే.... ఇంకొందఱిలో చాల పలుచగా వుంటుంది. సాధారణముగా ఈ విరేచనాలలో పసరు ఎక్కువగా పోతుంది.

ఈ విరేచనాలు ఏ మాత్రము ఎక్కువగా వున్నా వెంటనే "సెలైన్" పెట్టి, "ఎలక్ట్రోలైట్స్" నరముల ద్వారా సెలైన్‌తో పంపిం చాలి. కొబ్బరినీళ్ళు, గ్లూకోజ్‌నీళ్ళు, ఉప్పునీళ్ళు చాల ఎక్కువగా ఇవ్వాలి. విరేచనాలు బాగా ఔతున్న వారికి మందులు విడిగా ఇవ్వకుండా సెలైన్‌తోపాటే శరీరములోనికి పంపాలి.

విరేచనాలు ప్రారంభముకాగానే దగ్గరలో వున్న వైద్యశాలకు వెంటనే తీసికెళ్ళి, "పెక్టిన్". కైయోలిన్‌తో తయారైన మందులూ, "నియోమైసిన్"+"పెక్టిడిన్" కాంబినేషన్‌తో తయారైన మందులూ; జాగ్రత్తగా వాడి వీటిని నివారించాలి. ఉదా॥ పెక్టోకేబ్ (Pectokab) 30 ml పిల్లలకు; రినోకాబ్ (Renokab) బిళ్ళలు-లిక్విడ్; కాలిటిన్ విత్ నియోమైసిన్ (Kalitin with Neomycin), క్రియోమైసిన్ (Cremomycin) లిక్విడ్స్, ఫ్యూరాక్సోన్ (Furoxone) బిళ్ళలు-సస్పెన్షన్, కాన్‌సిన్ (Kancin) గొట్టములు మొ॥నవి.

## బంక-రక్త విరేచనములు (AMEBIASIS)

బంక, చీము, రక్త విరేచనాలతో కూడుకొన్న "అమీబియాస్" అనే వ్యాధి సూక్ష్మక్రిముల ద్వారా వస్తుంది. రోజులో 20 లేక 30 సార్లు ఈ విరేచనాలు ఔతూ వుంటాయి. కడుపులో ప్రేగులు మెలికలు తిరిగి పోతున్నట్లుగా విపరీతమైన బాధగా వుంటుంది. ఈ విరేచనాలు రెండు లేక మూడు రోజులుండి మళ్ళీ తగ్గిపోతాయి. ఐతే ... తరువాత విరేచనము సాఫీగా కాకుండా మలబద్ధకము ప్రారంభమౌతుంది. మళ్ళీ

కొన్నాళ్ళకు రక్తము బంక, చీముతో విరేచనాలు ప్రారంభమై, విపరీతమైన చికాకును కలిగిస్తాయి. ఈ వ్యాధి వచ్చుటకు ముఖ్యమైన కారణము "ఎనమివాహిస్టోలిటికా" అనే ఏక కణజీవి: ఈ సూక్ష్మక్రిమి శరీరంలో ప్రవేశించిన రెండు-మూడు వారాలలోనే జిగురుతో కూడుకొన్న రక్త విరేచనాలు ప్రారంభమౌతాయి.

ఈ క్రిమి ఒక పట్టాన చచ్చిపోదు. ముఖ్యముగా ఇది సిస్ట్ రూపముగా మారిన తరువాత మందులు అంతంత మాత్రముగానే పని చేస్తాయి. "అమీబా" ప్రవేశించిన వారిలో 90% లివర్‌కు వ్యాధి సోకుతుంది. ఈ జీవి ఎక్కువకాలము శరీరములో నిలిచి వున్నప్పుడు—మెదడు, ఊపిరితిత్తులకు కూడా వ్యాధి వస్తుంది. "అమీబియాస్" వ్యాధి సోకినవారికి పొత్తి కడుపులో కుడివైపు నొక్కితే విపరీతమైన నొప్పిగా వుండి, తరచు జ్వరము వస్తుంది. కొద్దిమందికి 'లివర్' పరిమాణము పెరుగుతుంది.

ఈ వ్యాధి సోకినవారు వెంటనే వైద్యుని సంప్రదించి, మలాన్ని పరీక్ష చేయించుకొని మెట్రానెడాజోల్ (Metronidazole), ఫ్లాజిల్ (Flagyl) యూనిమెజాల్ (Unimezol), టినిడజోల్ (Tinidazol) బిళ్ళలు-సిరప్, ఇంజక్షన్‌లు; ఎంటొబెక్స్ (Entobex) ఎంబిప్లాన్ (Amdiplon) బిళ్ళలు-లిక్విడ్స్; "ఎమిటిన్"తో తయారైన ఎంబిస్ (Embis)- 15 mg బిళ్ళలు; "డిహైడ్రో ఎమిటిన్ (De-Hydro-Emetine)" బిళ్ళలు- 2 C C. ఇంజక్షన్ మొ॥గు మందులను జాగ్రత్తగా వాడాలి! ఈ వ్యాధిని నిర్మూలించకపోతే.... ముందు-ముందు చాలా అనర్థాలు వస్తాయి. ఈ వ్యాధి ఒకసారి వచ్చి పూర్తిగా తగ్గిపోయినా.... ఆహార- పానీయాల విషయములో చాల జాగ్రత్తగా, శుభ్రముగా వుండాలి,

## "అల్సరేటివ్ కొలైటీస్" (ULCERATIVE COLITIS) వ్యాధి వలన వచ్చే విరేచనములు

ఈ వ్యాధి వచ్చేవారికి ముఖ్యముగా ఉదరములో ప్రేగులు గడబిడగా వుంటాయి. ఏ కారణము లేకుండానే విరేచనాలు అగుట, బరువు తగ్గిపోవుట; విరేచనాలు-చీము-రక్తముతో కలసి నీళ్ళలాగా ఉండి, దుర్వాసనతో రోజు మొత్తములో 20 నుండి 40 ఔతాయి. క్రిముల వలన వచ్చిన విరేచనాలు- మందులు వాడితే తగ్గిపోతాయి. ఇవి మాత్రము కొన్ని మందులకు తగ్గినట్లు కనిపించినా ఏదైనా బాగా దిగులు, ఆలోచనా కలిగించే విషయాలు తటస్థిస్తే మళ్ళా పై మాదిరి గానే ప్రారంభమౌతాయి.

ప్రతి చిన్న విషయానికి విపరీతముగా ఆలోచించే వారికి, బాగా ఆందోళనపడేవారికి, బాధపడేవారికి ఈ వ్యాధి త్వరగా వస్తుంది. మరో విషయము—సుమారు 20 ఏళ్ళ వయస్సు వారినుండి 40 ఏళ్ళ వయస్సు వారికి మాత్రమే ఈ మానసికమైన అశాంతి వలన వచ్చే "అల్సరేటివ్ కొలైటీస్" కనిపిస్తుంది. దీనికి వైద్య శాస్త్రజ్ఞులు మరికొన్ని కారణాలు కూడా చెబుతున్నారు. కొందటికి సరిపడని కొన్ని ఆహార పదార్థాల వలన "ఎలర్జీ" కలిగి.... ఈ వ్యాధి రావచ్చును. ఇంకా.... "బాక్టీరియా" వలన "అమీబియాస్" అనే క్రిముల వలన కూడా వస్తుంది. ఈ వ్యాధి సోకిన వారికి రక్తము విపరీతముగా పోతుంది. నోట్లో పూత, శరీరములో నీరు లేకపోవుట, మనిషి క్షీణించుట, వీటికి తోడు జ్వరముకూడా వస్తుంది. ఈ వ్యాధిని నివారించుటకు సరైన మందులు పెద్దగా లేవనే చెప్పాలి. ఐతే.... అనుభవమున్న క్వాలిఫైడ్ డాక్టర్స్ వ్యాధి సోకిన వ్యక్తిని ఉత్సాహపఱచి, మెంటల్‌గా ఏ ఆలోచన లేకుండా చేసి, చాలా కేస్‌లలో విజయాన్ని సాధించారు. ఈ వ్యాధికి సాధారణముగా ట్రాంక్విలైజర్స్ (Tranquillizers) ఉదా॥ ఎస్కాజైన్ (Eskazine) 1 mg 5 mg బిళ్ళలు-ఇంజక్షన్స్ మందులు మఱియు "కార్టిజోన్స్"తో తయారైన

మందులు, ఎనబాలిక్ స్టెరాయిడ్స్‌తో తయారైన మందులను వైద్యులు వినియోగించి కంట్రోల్ చేస్తారు.

# జీర్ణకోశములో వివిధ రకముల పాములు (క్రిములు) వాటి నిర్మూలన

## కొంకి పురుగు (HOOK-WORMS)

కాలికి ఏ అచ్ఛాదనా లేకుండా మురికి ప్రదేశాలలో నడిచినప్పుడు- యీ కొంకి పురుగులు అరికాలి చర్మాన్ని తొలుచుకొని, దేహములోనుండి శ్వాసకోశములోకి ప్రవేశించి మెల్లమెల్లగా ఊపిరి గొట్టాల నుండి అన్న వాహికలోకి చేరుతాయి. తరువాత చిన్న ప్రేగులలోకి చేరి- అక్కడ శాశ్వత నివాసము ఏర్పరచుకొని, ఆ పరిసరాలలో వున్న రక్తనాళాలకు బెజ్జాలు పెట్టి- వాటి ఆహారమైన రక్తాన్ని త్రాగుతాయి. ఇవి త్రాగే రక్తము కొంచెమే ఐనా.... చాల రక్తము ఆ కన్నాలలో నుంచి అనవసరముగా పోతుంది. యీ పురుగుల వలన రక్తహీనత (ఎనీమియా) ఏర్పడే ప్రమాదము కూడా దగ్గఱలోనే వుంటుంది. ఇవి కొంకిపురుగులుగా పూర్తి రూపము సంతరించుకొన్నాక... వీటి పరిమాణము దరిదాపు అర అంగుళానికి కొద్దిగా అటూ - ఇటూ ఉంటాయి.

మన శరీరములో వున్న రక్తమే ఆహారముగా త్రాగి బ్రతికే యీ కొంకి పురుగుల వ్యాధి వచ్చిన వారికి విపరీతమైన నీరసము- అలసట, ఏ కొంచెము నడచినా ఆయాసములతోపాటు రక్తము లేక వాలిపోవుట, కడుపులో పుండు ఉన్నట్లు నొప్పిగా ఉండుట; చిన్నపిల్లలకైతే ముఖము ఉబ్బుట, కడుపు ఎత్తుగా వుండి, కాళ్ళకు- పొట్టకు నీరు చేరినట్లుగా లక్షణాలు కలిగి ఉంటారు.

పై లక్షణాలు కలిగినవారు డాక్టర్‌ను సంప్రదించి- వారు సూచించినట్లుగా "మల" పరీక్ష చేయించుకొని, కొంకి పురుగులను నాశనము చేయుటకు డెకారిన్, పాస్ట్రల్మిన్, మెబెక్స్‌లాంటి మందులు; పిప్రాజైమ్ సిట్రేట్ + ఎడిఫేట్ + హెక్స్ హైడ్రేట్ + డై ఎటిల్ కార్బమా

జైన్+డైతీయాజా కాంబినేషన్‌తో తయారైన మందులను వాడాలి. ఉదా॥ నియోబెడర్‌మిన్ (Neo-Bedermin) గొట్టములు; "అల్కోపార్ (Alcopar)" పలుకుల మందు; "టెట్రాకేప్ (Tetracap)" గొట్టములు మొ॥నవి.

కోల్పోయిన రక్తాన్ని తిరిగి సమకూర్చుకొనుటకు 'ఐరన్' టానిక్స్-బిళ్ళలు; ప్రొటీన్స్ కొఱకు వాటికి అనుగుణమైన మందులు, ఆహారము వాడాలి. యీ వ్యాధి మరలా రాకుండా ఉండుటకు పరిసరాలను పరిశుభ్రముగా ఉంచుకొనుటయేగాక ... కాలికి చెప్పులు వేసుకొనుట లాంటి అలవాట్లను పెంచుకొని, పైన చెప్పిన లక్షణాలు కనిపించగానే వెంటనే మలపరీక్ష చేయించుకొని తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

## బద్దె పురుగులు (TAPE WORMS)

యీ బద్దె పురుగులను "బద్దె పాము"లని కూడా అంటారు. ఇవి చాల ప్రమాదకరమైనవి. ఇవి పంది, గొడ్డులాంటి మాంసాహారములు తినే వారిలోనే అధికము (90%)గా ఉంటాయి. బద్దె పురుగులు కడుపులోకి జేరి.... పెద్ద ప్రేగుల గోడలను అంటిపెట్టుకొని రక్తాన్ని త్రాగి జీవిస్తాయి. ఇవి మామూలు పాములకంటే పొడవుగా కూడ ఉంటాయి. బద్దె పురుగులు పూర్తిరూపము సంతరించుకున్న తరువాత వీటి పొడవు సుమారు 1 మీటర్ నుండి 3 మీటర్స్ వఱకు ఉంటాయి. అరుదుగా కొంతమందిలో ఇంకా బాగా పొడవుగా కూడా ఉండవచ్చును. వీటివలన చిన్న చిన్న చికాకు కలిగించే విషయాలు తక్కువేకాని; అడపా-తడపా విరేచనాలు, కడుపులో విపరీతముగా నొప్పి ఉంటుంది. వీటి గ్రుడ్లు దేహములో ప్రవేశించినప్పుడు ఒళ్ళంతా నలుపుగా ఉంటుంది. అలాగే గ్రుడ్లు మెదడుకు చేరితే.... అక్కడ 'కణితి' తయారై దీనివలన మూర్ఛ వ్యాధిలో లాగా "ఫిట్స్" వచ్చుటకు అవకాశము ఉన్నది. "టీనియా", "సజైనాటా" అనే బద్దె పురుగులను నిర్మూలించుటకు మందులు వాడినప్పుడు- ఇవి చిన్న చిన్న ముక్కలుగా తెగి మలముద్వారా బయట పడతాయి. ఐతే దీని తల మాత్రము ప్రేగుల నంటిపెట్టుకొనే ఉండి

పోతుంది. ఈ చిన్న తల మరలా విస్తారముగా అంటే.... పైన చెప్పు కొన్నట్లు 1-3 మీటర్ల పొడవు పూర్తిరూపము పెరుగుతుంది.

పట్టభద్రులైన వైద్యుల పర్యవేక్షణలో.... సరియైన మందులు వాడనిదే పూర్తి పాము బయటకు రాదు. దీనికి "జంతువాత నివారణ (Anthelmintics)" మందులు వాడితే సమూలముగా నాశనమౌతుంది. ఉదా॥ క్రిస్టాయిడ్స్ (Crystoids) లిక్విడ్; వైస్టానిల్ (Vistannyl) బిళ్ళలు మొ॥నవి.

## ఏలిక పాములు (ROUND WORMS)

ఏలికపాములున్న వారికి కడుపులో విపరీతముగా నొప్పి ఉండి కొన్ని సార్లు "ఫిట్స్" కూడా రావచ్చు. దరిదాపుగా ఇవి ఆఅంగుళాల నుండి 10-15 అంగుళాల పొడవు వరకు ఉంటాయి. వీటినే వైద్యులు "యుస్కారిస్-లుంబ్రికాయిడ్స్" అంటారు. ఇవి వానపాము (ఎఱ) లాగా గుండ్రముగా ఉంటాయి. ఏలికపాములు చిన్న ప్రేగులలో బొడ్డు ఉండే చోట నివాసము ఏర్పరచుకొంటాయి. ఇవి కడుపులో వున్న వారికి బొడ్డు ప్రాంతములోనే విపరీతముగా నొప్పి వుంటుంది. ఈ ఏలిక పాములు పిల్లలలోనే ఎక్కువగా వుంటాయి. ఇవి ఉన్న వారికి ఆకలి వుండదు. అప్పుడప్పుడు విరేచనాలౌతాయి. ఎంత ఎక్కువగా తిన్నా.... నీరసముగా వుంటుంది. ఏలిక పాములు ఆడ- మగ కలిసే జీవిస్తాయి. మనము తిన్న ఆహారాన్ని ఇవి తినేస్తాయి. కాబట్టి పిల్లలు బలహీనముగా వుంటారు. అప్పుడే పుట్టిన చిన్న చిన్న పాములు శ్వాసకోశములోనికి ప్రవేశించి నప్పుడు ఛాతిలో నొప్పిగా వుండి దగ్గు, దగ్గుతోపాటు రక్తము పడుతుంది. పొట్టలోపల ఈ పాములున్నప్పుడు కొద్దిమందికి "ఎలర్జీ" వలన శరీర మంతా దద్దురులు కూడా రావచ్చు, మరికొందరిలో "ఈసినోఫిలియా" కనిపిస్తుంది. ఇంకొందరిలో వికారముతోపాటు వాంతులై....నోటిలో నుండి అరడుగు-అడుగు సైజ్‌లో వుండే పాములు కొన్ని పడతాయి. కొందరికి యీ పాములున్నప్పటికీ పైన చెప్పిన లక్షణాలేవి కనిపించకపోవచ్చు.

"రౌండ్-వర్మ్స్" వున్న వారికి "పైపరజైన్ (Piperazine)"

మందులను వాడాలి. ఉదా॥ యాంటిపార్ (Antepar) బిళ్ళలు-పొడి-సిరప్; హెల్మాసిడ్ (Helmacid) పొడి; "ఆల్కో-పార్" వలుకుల మందు మొ॥నవి.

## నులి పురుగు (PIN-WORMS)

ఇవి చేరిన వారికి- ఆకలి లేకపోవుట; నలతగా వుండుట, తిన్నది సరిగా ఒంటబట్టకపోవుట లాంటి లక్షణాలు కనిపిస్తాయి. యీ నులి పురుగులు సాధారణముగా బాగా పెరిగితే.... గుండు సూది అంత సైజ్ వుంటాయి. మామూలుగా ఐతే.... అర అంగుళము లేక పావు అంగుళము సైజ్ మించకుండా వుంటాయి. ఇవి ఒక విరేచనములోనే వేల సంఖ్యలో కనబడతాయి. వీటిని నివారించుటకు "లెవమిసోల్ (Levamisole)" మందులను వైద్య పర్యవేక్షణలో వాడాలి. ఉదా॥ : వెర్మిసోల్ (Vermisol) బిళ్ళలు-సిరప్, కెట్రాక్స్ (Ketrax) బిళ్ళలు, విజోల్ (Vizole) కాప్స్యూల్స్-సిరప్ మొ॥నవి.

## కలరా (CHOLERA) నివారణ

యీ "కలరా" అనే మహమ్మారి దరిదాపుగా ఇప్పుడు చాల తక్కువనే చెప్పవచ్చు. పూర్వము యీ వ్యాధి సోకి గ్రామాలకు- గ్రామాలే తుడిచి పెట్టుకుపోయేవి. యీ వ్యాధి వచ్చుటకు ఒక విధమైన బాక్టీరియా (Viblo-Cholera) క్రిములే కారణము! యీ క్రిములు శరీరములో ప్రవేశించిన 4 లేక 8 గంటలు వ్యవధిలోనే యీ జబ్బు బయటపడుతుంది. కొందటికి రెండు - మూడు రోజులు కూడా పట్టవచ్చును. మామూలుగా వేసవికాలములో వచ్చే విరేచనాలకు, కలరావ్యాధి సోకిన వారికి వచ్చే విరేచనాలకు ఒక ముఖ్యమైన తేడా వున్నది. యీ వ్యాధిలో విరేచనాలు ప్రారంభమైనప్పుడు మొదటిసారిగా అయ్యే విరేచనము చాల ఎక్కువగా అంటే రోజూ మనము విసర్జించే దానికన్నా 3 లేక 4 రెట్లు ఎక్కువగా వుంటుంది. రెండవది కూడా ఇంచుమించు అదే పరిమాణములో వుండి; తదుపరి మాత్రము కేవలము వట్టి నీటి విరేచనాలు మాత్రమే ప్రెషర్ పంప్ కొట్టినట్లుగా అౌతుంటాయి. వాంతులు కూడా వట్టి నీరులాగా మాత్రమే వస్తాయి. వాంతుల వలన ఎలాంటి వికారము

కడుపులో వుండదు. విరేచనాలకు కూడా ఎలాంటి కడుపునొప్పి అని పించదు. ఈ కలరా విరేచనాలు చూచుటకు బియ్యము కడుగు నీళ్ళలాగ తెల్ల తెల్లగా వుంటాయి.

కలరా వ్యాధి ప్రారంభమైన కొద్ది సేపటిలోనే రోగి యొక్క శారీరక స్థితి వికటిస్తుంది. వెంటనే వైద్య పర్యవేక్షణలో నరాలకి 'సెలైన్' ఎక్కించాలి. సరిపోయినంత నీరు శరీరానికి అందిన తర్వాత నోటి ద్వారా పండ్ల రసములు, గ్లూకోజ్, కొబ్బరి నీరు మొ॥నవి. ఇస్తుండాలి. "సల్ఫా" మరియు ఇతర కాంబినేషన్‌తో తయారైన మందు లను వాంతులు తగ్గిన వెంటనే.... నోటిద్వారా ఇవ్వాలి. ఉదా॥ సల్ఫో సిన్ (Sulfocin) బిళ్ళలు; బాసిప్లాన్ (Basiplon) గొట్టాలు-సిరప్; క్లోరోసల్ఫ్ (Chiorosulf) బిళ్ళలు-సిరప్ మొ॥నవి.

"యాంటీబయాటిక్" మందులు కూడా సరియైన మోతాదులలో సరియైన టైమ్‌కే వాడాలి. ఉదా॥ : టెట్రాసైక్లిన్, సైక్లోసిటిన్ (Cyclo-cetin) మొ॥నవి.

## మొలలు (PILES) - నివారణ

ఈ మొలల వ్యాధి రక్తనాళపు గోడలు పలుచగా వున్న వారికే ఎక్కువగా వుంటుంది. మల విసర్జనకు ముక్కుట వలన, మలబద్ధకము వలన- మొలలు తయారౌతాయి. స్త్రీలు గర్భిణితో వున్నప్పుడు మొలలు బయటపడి తర్వాత తగ్గిపోతాయి. ఇవి వచ్చుటకు ముఖ్యమైన కారణము రక్తనాళాలు ఉబ్బి, సాగటము! దీనితో మొలలు పెరుగుతాయి. కొంద రికి వంశానుగతముగా కూడా ఈ వ్యాధి వస్తుంది.

ముఖ్యముగా మొలలను మూడు దశలుగా విభజించవచ్చును. మొదటి దశలో మొలలు కనపడకుండా మలవిసర్జన చేసేటప్పుడు రక్తము బొట్లు బొట్లుగా పడుట తప్ప ఎటువంటి బాధ వుండదు. ఈ దశలో "మొలల మందులు (Antihemorrhoids)" వైద్య పర్యవేక్షణలో వాడి నివారించవచ్చును. ఉదా॥ : పైలెక్స్ (pilex) బిళ్ళలు-ఆయింట్ మెంట్, పైలాన్ (Pilon) బిళ్ళలు, జైలోకైన్ జెల్లి (Xylocine Jelly) మల ద్వారానికి పూతమందు మొ॥నవి.

ఇక రెండవదశలో ఈ రక్తనాడులు ఉబ్బి, పెద్దవిగా తయారై విరేచన సమయములో ఇవి కూడా మలముతో పాటుగా బయటకువచ్చి మెత్తని బొడుములాగా చేతికి తగులుతాయి. కొద్దిసేపటిలో మరలా ఇవి లోపలికి వెళ్ళిపోతాయి.

మూడవదశలో మొలలు మలవిసర్జనతో ఎటువంటి సంబంధము లేకుండానే మల ద్వారమునుండి బయటకువచ్చి, తడవ- తడవకూ చిట్లిపోతూ విపరీతముగా రక్తము కారుట, చీముపట్టుట, వాసన వచ్చుట వంటివేకాక-రోగి విపరీతమైన బాధలకు గురౌతాడు.

మొదటి దశలో ఐతే.... మందులతో మొలలలు పెరుగకుండా, చిట్లకుండా, మల విసర్జన తేలికగా జరుగుటకు లిక్విడ్ పారాఫిన్ లాంటివి వాడి నిరోధించవచ్చు! కానీ-రెండవదశ, మూడవదశలలో ఇది దాదాపు అసాధ్యమే? ఈ సమయములో శస్త్ర చికిత్సా నిపుణులను సంప్రదించి, వీటిని శాశ్వతముగా నిర్మూలించుకోవాలి! కొంతమందివాడే- నాటు మందులు, మంత్రాలకు ఇవి తగ్గకపోగా.... లేనిపోని క్రొత్త వ్యాధులు ప్రారంభమగును.

## ఈసినోఫిలియా (EOSINOPHILIA) - నివారణ

"ట్రాపికల్ పల్మొనరీ ఈసినోఫిలియా" అని పిలువబడే యీ వ్యాధి-దోమకాటు ద్వారా ప్రవేశించే.... "పైలేరియా" అనే సూక్ష్మ క్రిములద్వారా సంక్రమిస్తుంది. యీ వ్యాధి వచ్చినవారికి దగ్గుతోపాటు-పిల్లికూతలు, ఆకలి లేకపోవుట, ఛాతిలో నొప్పి, అలసట, ఆయాసము, గొంతులో గుఱ గుఱ, తలబరువు, తలనొప్పి, ఛాతి బిగపట్టి ఊపిరి-అందనట్లు బాధ మొదలగు లక్షణాలు ఒక్కొక్కరికి ఒక్కో విధముగా ఉంటాయి. మరికొందటికి ఒళ్ళంతా దద్దురులు కూడా రావచ్చు.

ఈ వ్యాధి సోకినవారు రక్తపరీక్ష చేయించుకొని "పైలేరియా"కి మందులు వాడాలి. ఉదా॥ "హెట్రాజన్" (Hetrazan) బిళ్ళలుగాని, "బానోసైడ్" బిళ్ళలుగాని రోజుకు 6 బిళ్ళల చొ॥న 15 రోజులువాడాలి.

పై మందులతో "కార్టిజోన్" మందులుకూడా జాగ్రత్తగా వాడాలి! ఉదా॥ కార్టిసన్ (Cortison) ఇంజక్షన్స్; కార్టోన్ (Cortone) బిళ్ళలు మొ॥నవి.

డాక్టర్ పర్యవేక్షణలో "యాంటిహిస్టమిన్" మందులను కోర్స్‌గా వాడి మంచి ఫలితాలను సాధించవచ్చు.

### ప్రయాణములో వాంతులు-నివారణ

కొందఱికి బస్, రైల్, విమానము మొ॥లగు వాహనాలలో ప్రయాణము చేస్తే వాంతులు ఔతాయి. దీనికి కారణము చెవిలోపల వుండే "సెమిసర్క్యులర్ కెనాల్స్"- వాహన ప్రయాణ సమయములో.... విపరీతమయిన ఒత్తిడికి గుఱై.... ఈ "రిఫ్లెక్స్ యాక్షన్" వలన కొందఱికి వాంతులు ఔతూ ఉంటాయి. ఈ లోపము ఉన్నవారికి విడిగా చెవుల వలన ఏ ఇతర ఇబ్బంది ఉండదు. మామూలుగానే ఉంటారు. ఇంకొందఱికి-జీర్ణాశయము- ప్రేగుల యొక్క విపరీతమైన కదలికల వలన: మరికొందఱికి-పెట్రోల్ వాసనలు పడక వికారము—వాంతులు రావచ్చును.

ఇలా ప్రయాణములో వాంతులయ్యేవారు ప్రయాణానికి ముందుగా "యాంటి-ఎమిటిక్స్" (Anti Emetics) వేసికొని బయలుదేరితే వాంతులు రావు. ఉదా॥ "ఎవోమిన్ (Avomine)" బిళ్ళలు; 'గ్రావాల్' బిళ్ళలు; "ఎస్కాజైన్" (Eskazine) బిళ్ళలు మొ॥నవి.

## కళ్ళవ్యాధులు - నివారణ

### ఆశ కురుపులు (STY)

కను ఱెప్పలలో చాల చిన్నవిగా ఉండే "జీస్" గ్రంధులు వాచుట వలన కంటిఱెప్ప అంతా వాచి, లాపై కనుఱెప్పలమీద మినుపగింజంత కుఱుపు లేస్తుంది. ఇటువంటివి అప్పుడప్పుడు వచ్చి తగ్గిపోతూ ఉంటాయి. ఇలా వచ్చుటకు ముఖ్యమైన కారణము "బాక్టీరియా క్రిము"ల వలన

"జీన్" గ్రంధులు జబ్బులో పడుటయే ! ఈ వ్యాధి వయస్సులో ఉన్న వారికే ఎక్కువగా వస్తుంది.

ఈ వ్యాధి ఇలా తరచుగా వచ్చేవారు "యాంటీబయాటిక్" మందులువాడి ఆశ కుఋపులను నిర్మూలించాలి. ఉదా॥ "టెట్రామైసిన్" బిళ్ళలు-ఇంజక్షన్స్; "పెనిసిలిన్" బిళ్ళలు-ఇంజక్షన్స్; నొప్పికి-ఐబుబిడ్ (Idudid) బ్రూఫెన్ (Brufen) బిళ్ళలు మొదలగునవి.

## కళ్ళకలక

"కంజంక్టివైటిస్" అనే ఈ కళ్ళ కలక వ్యాధి ఒకరికివస్తే.... ఆ కుటుంబములో అందరికి అంటుకొంటుంది. ఒక విధమైన "వైరస్" క్రిముల వలన కంటికి ఈ వ్యాధి వస్తుంది. ఇది సోకిన వారికి ముందు ఒక కంటికివచ్చి, తరువాత రెండవ కంటికి వస్తుంది. ఈ కళ్ళకలక వచ్చినవారు వాడిన దుస్తులు, వస్తువులకు ఇతరులు దూరముగా ఉండాలి.

Viral Conjunctivitis 3-4 రోజులుండి తగ్గిపోతుంది. దీని వలన ఇతర ఇబ్బందులేమి అంతగా ఉండవు. కాకపోతే.... ఇది తగ్గేంత వరకు కళ్ళకు మంట- బాధ ఎక్కువగా ఉంటాయి.

కళ్ళకు కలక వచ్చినవారు "టెట్రామైసిన్", "స్ట్రెప్టొమైసిన్" మొ॥లగు కంటి ఆయింట్‌మెంట్‌లు, డ్రాప్స్ వ్యాధి తగ్గేంతవరకు వాడాలి. "యాంటీబయాటిక్స్" కూడా వాడాలి.

## శుక్లాలు (CATARACT)

కంటిలోపల ఉండే "లెన్స్" కొన్ని కారణాల వలన తన సహజత్వాన్ని కోల్పోయి గట్టిపడి, తెల్లగా మారుట జరుగుతుంది. శుక్లాలు దరిదాపుగా 45 నుండి 50 సంవత్సరాలు దాటిన వారిలోనే కనపడతాయి. అరుదుగ కొందరిలో పుట్టుకతోనే శుక్లాలు మొదలై, పది సంవత్సరాల వయస్సులోపే చూపు కనపడని పరిస్థితి ఏర్పడుతుంది. ప్రారంభంలో ఈ శుక్లాలు ఉన్నవారికి దూరపు వస్తువులు కనబడుట ఉండదు. తరువాత నిదానముగా చూపు మందగించుట పెరిగి, అర్థ

గజము దూరములో ఉన్న వస్తువులుకూడా కనిపించకుండా పోతాయి. యీ శుక్లాలు ఏ కారణము వలన వస్తాయో స్పష్టమైన కారణాలు ఇంకా తెలియక పోయినా.... కొందరిలో మాత్రము కారణాలు కనిపిస్తాయి.

"కాటరాక్ట్" వచ్చినవారు విధిగా నేత్రవైద్యుని సంప్రదించి, శస్త్ర చికిత్స చేయించి దీనిని తొలగించాలి. అంతేగాని ఏ విధమైన మందులకు ఇది కరిగిపోదు. అంతేకాదు.... యీ వ్యాధిని ముదరపెడితే "Glancoma" మొదలగు కాంప్లికేషన్స్ వలన శాశ్వతముగా అంధత్వము వస్తుంది. కాబట్టి కంటివిషయములో ఎవరైనా అత్యంత జాగ్రత్తగా ఉండాలి!

## కళ్ళవాపు (TRACHOMA)

కళ్ళకు యీ "ట్రకోమా" అనే వ్యాధి వచ్చుటకు ఒక విధమైన "వైరస్" కారణమౌతుంది. యీ సూక్ష్మక్రిములు కంటిలో ప్రవేశించిన మూడు- నాలుగు రోజులలోనే యీ వ్యాధి లక్షణాలు బయటపడతాయి. కనురెప్పలు పైకెత్తిచూస్తే చెమట గుల్లలంత చిన్న చిన్న పొక్కులు కొన్ని ఉంటాయి. వీటినే వైద్య పరిభాషలో "Fllicle" అని అంటారు. యీ వ్యాధి రెండుకళ్ళలోనూ వస్తుంది. అంతేకాదు ఇది అంటువ్యాధి కూడా!

యీ వ్యాధి ఉన్నవారికి వెలుతురుచూస్తే కళ్ళవెంట నీరువస్తుంది. వీరు ఎక్కువగా కనురెప్పలు నలుపుకుంటారు. కొన్నాళ్ళకు కనులు, రెప్పలు బరువుగా ఉంటాయి. పై రెప్పలు మూసుకోలేక సగము కన్ను ఎప్పుడూ తెరుచుకునే ఉంటుంది యీ వ్యాధి ఉన్నవారు వెంటనే చికిత్స చేయించుకోకపోతే.... పై లక్షణాలన్నీ విపరీత స్థాయిలో వస్తాయి.

యీ వ్యాధి కలవారు "సల్ఫా" బిళ్ళలు; "టెట్రాసైక్లిన్" కంటి మందులువాడి తేలికగా యీ ట్రకోమా వ్యాధిని తగ్గించుకోవచ్చును. ఉదా॥ కార్టోలో (Cortolo) ఐ-డ్రాప్స్; బెట్నెసాల్ (Betnesol) ఐడ్రాప్స్; మైడాసిన్ (Mydacin) ఐ-ఆయింట్మెంట్ మొ॥నవి.

పంచేంద్రియాలలో కన్ను అతి ముఖ్యమైనది. వీటి విషయములో అతి జాగ్రత్తగా ఉండాలి. కంటిలో ఏవైనా నలకలు గాని, కురుపులు గాని, ప్రమాదవశాత్తు ఏమైనా కంటికి దెబ్బగాని తగిలి రక్తము కారు తున్నా.... వెంటనే వైద్యుని సహాయముతో నివారణ చేసికోవాలి.

## పచ్చకామెర్లు (JAUNDICE) నివారణ

ఈ వ్యాధి వచ్చినవారికి ప్రారంభములో బడలిక; వికారము, కొద్దిగా జ్వరము అనిపిస్తాయి. ఈ వ్యాధిని అశ్రద్ధచేస్తే ... కోరి ఆత్మ హత్య చేసికొన్నట్లే! ఈ వ్యాధి సోకినవారికి అన్నం హితవు ఉండదు! తిన్నా అరుగదు. ఈ 'కామాలవ్యాధి' వచ్చినవారికి ఏ మాత్రము శారీరక శ్రమ ఉండకూడదు. సాధ్యమైనంత వరకు పడక- విశ్రాంతి ఇవ్వాలి. రోగికి అతి తేలికగా అరిగే ద్రవపదార్థాలు, పండ్ల రసాలు, పిండి పదార్థాలు ఉన్న ఆహారము, మాంసకృత్తులు ఉన్న ఆహారము— ముఖ్యముగా విటమిన్-C ఇస్తే మంచిది. "కామెర్లు" అనే అనుమానము వచ్చినప్పుడు- మూత్రముతో "Bile" పోతుందేమోనని పరీక్ష చేయాలి. ఇంకా 'లివర్' ఫంక్షన్ టెస్ట్లు చేయించి వ్యాధి తీవ్రతను నిర్ణయించాలి. వెంటనే "క్లోర్ టెట్రాసైక్లిన్" గొట్టాలు— ఆరు గంటల కొకటి చొప్పున రోజుకు- నాలుగుసార్లు ఈ వ్యాధి తగ్గేవరకు ఇవ్వాలి. కొంచెము తీవ్ర ముగా ఉన్నవారికి "డెక్ట్రోస్" ఇంజక్షన్లు రోగ స్థాయినిబట్టి ఇవ్వాలి. ఇంకా- "B— కాంప్లెక్స్" సమృద్ధిగా ఉన్న గొట్టాలు, టానిక్లు ఇవ్వాలి. వ్యాధి కారణాలనుబట్టి కొన్ని కేస్లలో— "కార్టిజోన్స్" కూడా ఇవ్వాలి.

(ఆయుర్వేద మందులను— అల్లోపతి మందులు తయారుచేసే కొన్ని కంపెనీలు కూడా తయారు చేస్తున్నాయి. [ఉదా॥ : లివ్ - 52 బిళ్ళలు హెపెక్స్ బిళ్ళలు మొ॥నవి]. వీటిని సారికి రెండు బిళ్ళలు చొప్పున రోజుకు మూడుసార్లు అంటే.... ఒక్కరోజుకి ఆరు బిళ్ళలు చొ॥న సుమారు ఆరు వారాలు వాడితే.... ఈ వ్యాధి తగ్గుతుంది.)

ఈ పచ్చకామెర్లు అనేది ఒకరకమైన 'వైరస్' వలన కలిగే వ్యాధి! మల- మూత్రములచే కలుషితమైన త్రాగునీటిద్వారా వైరస్ క్రిములు శరీరములోనికి ప్రవేశించి.... తదుపరి కాలేయమును చేరి "ఇన్ఫ్లమేషన్" "నెక్రోసిస్" వచ్చునట్లు చేయుట వలన "లివర్" పని చేయక పైన ఉదహరించిన లక్షణాలు కనిపిస్తాయి. ఈ క్రిములు శరీరములో ప్రవేశించిన తరువాత 15 రోజులనుండి 45 రోజులలోపు ఎప్పుడైనా ఈ వ్యాధి లక్షణములు బయటపడవచ్చును. ఈ 15- 45 రోజుల కాలాన్నే "ఇంక్యుబేషన్ పీరియడ్" అని వైద్య పరిభాషలో అంటారు. ఈ వ్యాధిని అశ్రద్ధచేస్తే రోగి "హెపాటిక్ కోమా" (అపస్మారము)లోకి ప్రవేశించి ప్రాణము పోయే ప్రమాదమున్నది!

ముఖ్యముగా ఈ వ్యాధి వచ్చినవారు క్వాలిఫైడ్ డాక్టర్‌ను సంప్రదించి దీన్ని నిర్మూలించుకొనవలెనే కాని.... ఛాదస్తానికి పోయి.... పెద్దలు చెప్పారని, ఎవరో కల్పించుకొంటే తగ్గిందని: ఇలా అనేక రకాలుగా మూఢ విశ్వాసాలకు విలువనిచ్చి ప్రాణాల మీదకు తెచ్చుకో గూడదు.

## మూత్రపిండాల వాపు - నివారణ

ఈ వ్యాధిని వైద్య పరిభాషలో "Pyelonephritis" అని అంటారు. ముఖ్యముగా ఈ వ్యాధి "ఇ- కొలై (E- Coli)" అనే బాక్టీరియా క్రిముల వలన సంక్రమిస్తుంది. ఈ వ్యాధి సోకినవారికి పొత్తి కడుపులో నొప్పి, చలిజ్వరము, వణుకు, నడుము నొప్పి, కడుపులో వికారము, తల నొప్పి, వాంతులు, ఒళ్ళునొప్పులు- వీటితోపాటు మూత్రము తఱచుగా వచ్చుట, దీనితో మంట మొదలగు లక్షణాలు హఠాత్తుగా వస్తాయి. కొందరిలో ఈ లక్షణాలు కొంచెముగానే ఉండి- తగ్గిపోయి- మళ్ళీ వచ్చి, వ్యాధి బాగా ముదిరిపోయి "యురేమియా", "రక్తపోటు" వంటి విపరీత పరిణామాలను చవి చూపుతాయి. ఈ వ్యాధి ఏ వయస్సు వారికైనా వస్తుంది. ఇది ఎక్కువగా గర్భవతులైన స్త్రీలకు వచ్చుటకు అవకాశమున్నది. ఎందుకంటే.... స్త్రీలకు నెలలు నిండు

తున్నప్పుడు మూత్రనాళాలు నొక్కుకుపోయి మూత్రము సరిగా పయ నించుటకు వీలులేక మూత్రకోశములోని క్రిములు బాగా పెరిగి "పైలైటిస్" వ్యాధి వస్తుంది. స్త్రీలుగాని, పురుషులుగాని ఎవరికైనా సరే "సుగర్" వ్యాధి ఉంటే.... వారికి కూడా మూత్రపిండాల వాపు వ్యాధి అతి తేలికగా సంక్రమిస్తుంది. ముఖ్యముగా ఈ వ్యాధి వచ్చినవారు "డైయూరిటిక్స్ (Diuretics)" మందులను అసలు వాడకూడదు.

ఈ వ్యాధి సోకినవారు అనుభవజ్ఞులైన వైద్యులను సంప్రదించి, వారు చెప్పిన విధముగా యాంపిసిలిన్ (Ampicillin) గొట్టాలు, రోసిలిన్ (Roseillin) గొట్టాలు- సిరప్- ఇంజక్షన్స్ వంటి 'యాంటీబయాటిక్' మందులు; క్లాక్సాలిన్ (Cloxallin) గొట్టాలు మరియు ఇతర కాంబినేషన్‌లతో తయారైన మందులు; ఆల్కలైన్ (Alkaline) సిరప్‌లాంటి మందులు మరియు లేత కొబ్బరి నీరులాంటి ద్రవ పదార్థాలను అధికముగా వాడి, జాగ్రత్తగా ఈ వ్యాధిని పారద్రోలాలి.

# చర్మవ్యాధులు - నివారణ

## చెమట గుల్లలు

ఇవి ఎక్కువగా ఎండాకాలములో వస్తాయి. ఈ కాలములో చెమట విపరీతముగా పోసి, గాలికి ఒంటిమీద దుమ్ము- ధూళి అంటుకొని చెమట వచ్చే రంధ్రాలు మూసుకొనిపోయి, బుల్లి బుల్లి కదుములు బయట పడతాయి. వీటిని వాడుకలో "చెమట గుల్లలు" అంటాము. ఇవి ఒంటి మీద ఏ ప్రదేశములోనైనా రావచ్చును. ఇవి అధికముగా వచ్చేవారు రోజుకు నాలుగైదుసార్లు చన్నీటి స్నానము చేసి, పలుచని బట్టలు ధరించి, సాధ్యమైనంత వరకు ఎండలోకి వెళ్ళకుండా.... చెమట ఎక్కువగాపట్టే భాగాలలో నైసిల్ పౌడర్ చల్లుకొని బాగా గాలి వచ్చే ప్రదేశాలలో నివసించాలి. తరుచు చెమటగుల్లలలో బాధపడేవారు చన్నీటి స్నానము గాకుండా గోరువెచ్చని నీటితో స్నానము చేయుట మంచిది.

## చీముగడ్డలు (FURUNCLE)

ఎండాకాలములో మడ్డితో కూడుకొన్న శరీరముపై "స్టఫలో కోకై" అనే బాక్టీరియా క్రిములు వెంట్రుకల మొదళ్ళలోనికి చేరి అక్కడ ఉండే "టిష్యూ"లను పాడుచేస్తాయి. పర్యవసానముగా శరీరము మీద చిన్నా- పెద్దా గడ్డలు అనేకము పుట్టుకొస్తాయి. ఈ ఉడుకుగడ్డలు మెల్లమెల్లగా 2 నుండి 5-6 రోజులలో పెద్దవై, పగిలి, చీము- నెత్తురు బయటకు వస్తుంది. వీటినే "సెగ్గడ్డ"లనీ, "Summer Boils" అనీ అంటుంటారు.

ఈ చీము కురుపులకు "యాంటి- హిస్టామైన్" (ఉదా॥ పెరిడెకా బిళ్ళలు) మందులు, "సెప్ట్రాన్" బిళ్ళలు లాంటి యాంటిబయాటిక్స్ రోజుకు రెండు చొ॥న వాడాలి.

ఈ రకమైన గడ్డలు తరచుగా వచ్చేవారు సాధ్యమైనంత వరకు తీపి, క్రొవ్వు పదార్థాలు తక్కువ తీసికొనుట మంచిది.

ఈ గడ్డలు ఆరంభములో ఉండగానే "యాంటి ఇన్ఫ్లమేటరి (Anti-Inflammatory)" మందులు వాడుట మంచిది. దీనితో "విట -మిన్ (Vitamin)" బిళ్ళలు కూడా వాడవలెను.

ముఖ్యముగా వీరు ఆకుకూరలు, కాయకూరలు ఎక్కువగా అలవాటు చేసుకొంటే మంచిది.

## దద్దుర్లు

ఈ దద్దురులను ఇంగ్లీషులో "Urticarla" అని అంటారు. ఇవి ఎక్కువగా ఎలర్జీ (Allergy) వలన వస్తాయి. ఈ ఎలర్జీ మనము తిన్న పదార్థములవలన కావచ్చును. ఎక్కువసార్లు మన జీర్ణాశయములో ఉండే.... ఏలికపాము, నులిపురుగు, అమీబావంటి క్రిములు వలన ఇవి వస్తుంటాయి. జీర్ణాశయములో క్రిముల వలన గడ్డలు వస్తే ... క్రిమినిరోధక మందులు వాడితే ఆ దద్దురులు తగ్గిపోతాయి. లేక ఆహార పదార్థము వలన "ఎలర్జీ" అని తేలినచో ఆ పదార్థాలను వాడకుండా మానివేస్తే దద్దురులు రావు కొన్ని పర్యాయములు ఎలర్జీకి జరుగు "ఇంట్రాడెర్మల్ టెస్టులు

(Intradermal Tests) చేయించి, వాటికి తగ్గ మందులు వాడవలసి రావచ్చును.

దద్దురులకు తాత్కాలికముగా "Antihistamine (యాంటి హిస్టమిన్)" మందులతో తయారయిన 'Avil' వంటి బిళ్ళలు వాడితే సరిపోవును. సాధ్యమైనంతవరకు "కార్టిజోన్స్ (Cortlzones)" వాడరాదు.

## పులిపిరి కాయలు (WARTS)

చర్మముమీద కొన్ని 'వైరస్ క్రిములు' స్థావరము ఏర్పరచుకొని ఉంటాయి. ఇవి చేరిన ప్రదేశములో చర్మములోని కణాలు ఎక్కువగా ఉత్పత్తి అవుతాయి. ఇలా పెరిగి పులిపిరి కాయలౌతాయి. ఈ క్రిములు జేరిన 3 నెలల తర్వాత 'పులిపిరికాయలు' బయట పడతాయి. వీటివలన ఎలాంటి బాధలూ ఉండవు.

వీటిని తొలగించుటకు వైద్యులు అనేక విధానాలను అమలు చేస్తారు. పులిపిరికాయలపైన 25% "పెల్" ద్రవము రాస్తే వూడిపోతాయి. లేదా 50% "పోడోపిల్లిన్" ద్రవము పులిపిరికాయలపైన రాసినా వూడిపోతాయి. ఇంకా 20% "శాలిసిలిక్ యాసిడ్" పూసినా ఈ కాయలు వూడిపోతాయి.

పైన చెప్పిన పద్ధతిలోనే కాక.... పులిపిరి కాయలను శస్త్ర చికిత్సద్వారా కూడా తొలగిస్తారు. ఈ పులిపిరికాయలను తొలగించుటకు పైన తెలిపిన రెండు పద్ధతులు తప్ప మరో మార్గములేదు.

## పెల్లగ్రా (PELLAGRA)

ఈ వ్యాధి ప్రారంభదశలో.... బలహీనముగా ఉండుట, ఆకలి మందగించుట, పొట్టలో మంటవంటి చికాకులు తరచుగా ఉంటాయి. ఈ వ్యాధి ముదిరిన వారికి ఎక్కువగా విరేచనాలు, వాటివలన మలద్వారము పుండుగా మారుట, బుద్ధి మాంద్యము వంటివేకాక.... ఒక విధమైన చర్మవ్యాధి వస్తుంది. ఇటువంటి చర్మవ్యాధి వచ్చిన వారికి ముఖము మీద చర్మము ఎండవలన కందిపోయినట్లుగా ఎఱ్ఱగా తయారౌతుంది. మోచేతులు, చేతులు, మెడ వెనుకభాగము కూడా పై మాదిరిగానే తయా

రౌతాయి. అంతేకాదు ... కొందఱికి కందినట్లుగా ఉన్న ఆ ప్రదేశములో కాలినప్పుడు వచ్చే బొబ్బలలాగ కూడవచ్చి వాటి స్థానములో చర్మము మందముగా నల్లగా ఔతుంది. అరుదుగా కొందఱికి చర్మము గాట్లు గాట్లుగా పగిలి చీము కూడా కారుతుంది. ఇంకా ఈ వ్యాధి వలన నోరు నోటిలోని నాలుక ఎర్రగా పూచి, ఏ మాత్రము కారము తగిలినా భగ్గున మండుతుంది.

మనము తినే ఆహారములో "నికోటినిక్ యాసిడ్" లోపించుట వలన ఈ వ్యాధి వస్తుంది. మొత్తము జీర్ణకోశమంతా పుండువలే చేసే ఈ వ్యాధిని వైద్య పరిభాషలో "పెల్లగ్రా" అని అంటారు. ఈ వ్యాధి-జొన్న, మొక్కజొన్న తినేవారిలో అధికముగా వస్తుంటుంది. వీరితో పాటు మామూలు ఆహారము తీసికొనేవారిలో కూడా పోషకాహార లోపము వలన "నికోటినిక్ యాసిడ్" లోపిస్తుంది.

ఈ వ్యాధికి సరియైన పోషకాహారము అంటే నికోటినిక్ యాసిడ్ ఉండే ఆహారపదార్థములైన లివర్, మాంసము, వేరుసెనగ మఱియు పప్పు పదార్థాలు; ముఖ్యముగా నానబెట్టిన పెసలు, సెనగలు (మొలకెత్తిన తర్వాత) రోజూ ఎక్కువగా తీసికొంటూ ఉంటే- మందులతో పెద్దగా పనిలేకుండానే "పెల్లగ్రా" తగ్గిపోతుంది. వైద్యుల సలహాల ననుసరించి చర్మ వ్యాధులను నివారించే మందులు వాడాలి. ఉదా॥ "నిబాసల్ఫ (Ncbasulf)" ఆయింట్‌మెంట్- పౌడర్; డెర్మా-సల్ఫ (Dcrma-Sulph) సొల్యూషన్; "కాలాడ్రిల్ (Caladryl)" క్రీమ్-లోషన్ మొ॥నవి.

## సోరియాసిస్ (PSORIASIS)

"ప్యూరిన్" ఎక్కువగా ఉండే పదార్థాలు తినే వారిలోనూ; మధుమేహము గలవారిలోను, జీర్ణకోశానికి సంబంధించిన జబ్బులున్న వారిలోను, మానసిక వ్యాధిగ్రస్తులలోను ఈ "సొరియాసిస్" వ్యాధి రావచ్చును. ఈ వ్యాధి వచ్చినవారికి గులాబిరంగులో ఉన్న గుండ్రని మచ్చలు అంగుళ ప్రమాణము నుంచి 10 అంగుళాల వఱకు విస్తరించి ఉంటాయి. ఈ మచ్చలమీద వెండిలాగా మెఱిసిపోయే తెల్లని "పొలుసులు"

చేపలకున్నట్లుగా ఒకదానిమీద ఒకటి దొంతర్లు దొంతర్లుగా పేర్చినట్లు ఉంటాయి. ఈ మచ్చలు మోచేతుల వెనుక, తలమీద, మోకాళ్ళముందు, నడుము వెనుక వస్తాయి. ఇవి తలమీద ఉంటే నుదురు పైభాగములో తల చుట్టూతా.... ఈ పొలుసులు కనబడతాయి. వీటిని పీకితే.... వాటిక్రింద ఎఱ్ఱని మచ్చలు కనబడతాయి. ఎక్కువమందికి ఈ వ్యాధి వచ్చి-పోతూ ఉంటుంది. సొరియాసిస్ వ్యాధి వలన ఎటువంటి ఇతర ఇబ్బందులు అంటే దురద, నొప్పి, మొ॥నవి ఉండవనే చెప్పాలి. ఈ వ్యాధికి తగిన మందు కూడా లేదనే చెప్పాలి.

ఈ వ్యాధి సోకినవారు వైద్యులను సంప్రదించి మానసిక వ్యాధి ఉన్నవారైతే "ట్రాంక్విలైజర్" మందులు వాడాలి. ఉదా॥ "కామ్-యు (Calm-U)" - 5 mg బిళ్ళలు, వాలియమ్ (Valium) బిళ్ళలు మొ॥ నవి అలాగే "కార్టికోస్టెరాయిడ్" మందులు, విటమిన్ మందులు కూడ వాడాలి.

## నారి కుఱుపువ్యాధి (GUINEA-WORM)

బావులు-చెఱువులలో ఉండే "సైకాలాప్స్" అనే సూక్ష్మక్రిములు-త్రాగునీటి ద్వారా-ఉదరములో ప్రవేశించిన తర్వాత.... జీర్ణకోశములో ఉండే ఆమ్లాల వలన-ఇవి చనిపోతాయి. ఇవి నీటిలో జీవించివున్నపుడు ఆహారముగా తిన్న "గినీ-వార్మ్" క్రిములు– మన జీర్ణకోశములో సైకోలాప్స్ నశించేముందు.... వాటి కడుపులో నుండి క్షేమముగా మన గర్భంలోకి ప్రవేశించి, ప్రేగులను ఛేదించుకొని, పొట్ట వెనుక భాగములో- ఆఱు నెలల మగ-ఆడ కలిసి జీవించి, సంయోగము చెందుతాయి. మరో మూడు-నాలుగు నెలల తర్వాత 'గినివార్మ్ ఆడక్రిమి' నీరు ఎక్కువగా తగిలే పాదాల ప్రాంతాలకు చేరుకొంటుంది. ఈ క్రిమి తల వున్నవేపు ఒక విధమైన విషాన్ని విడుదల చేస్తుంది. దానివలన చిన్న కుఱుపులేచి చీముపట్టి, కొంత నొప్పికలిగి, తర్వాత పగిలి, పుండుగా మారుతుంది. దీనినే "నారి కుఱుపు వ్యాధి" అంటారు. ఇది 5-6 వారాల వ్యవధిలోనే మానిపోతుంది. ఈ పుండువలన విరిగా పెద్ద బాధలేమీ ఉండవుగాని.... నీటిలో పాదాలు నానినప్పుడు అందులోనుండి ఒక విధమైన తెల్లని

ద్రవము బయటకు వచ్చి-నీటిలో కలిసిపోతుంది. పాదాన్ని నీటిలో ఒక అరగంట ఉంచిన తర్వాత జాగ్రత్తగా పుండును పరిశీలిస్తే చీకిపోయిన తుమ్మ ముల్లులాగా గినీవార్మ్ తల కనిపిస్తుంది. ఆ తలను పట్టుకొని మెల్లగా బయటకు లాగగలిగితే.... యీ పుండు అతిత్వరగా మానిపోతుంది. యీ పురుగు తెల్లగా.... దారములాగా ఉండి రెండునుండి మూడు అడుగుల వరకు పొడవు ఉంటుంది. నారి కురుపులు వచ్చినవారు- "స్ట్రెప్టో-పెన్సిలిన్" బిళ్ళలు-ఇంజక్షన్‌లు, "టెర్రామైసిన్" ఆయింట్‌మెంట్‌లాంటి యాంటిబయాటిక్ మందులువాడి.... జాగ్రత్తగా శుభ్రముగా "డ్రస్సింగ్" చేస్తే.... ఇది త్వరగా పోతుంది. (యీ వ్యాధి "రాయలసీమ"లో అధికమని చెప్పవచ్చును)

## ఆనెలు (CRONS)

ఆనెకాయలు పాదాలలో వచ్చుటకు ముఖ్యమైన కారణము చర్మానికి, ఎముకలకు చాలినంత కండలేని ప్రాంతాలలో ఎక్కువగా రాపిడి కలుగుట తద్వారా బాధ కలుగుటయే! ఇటువంటిచోట్ల చర్మానికి రక్షగా "టిష్యూ"లు గట్టిపడి ఆనెలుగా తయారై, శరీర బరువంతా పాదాల మీద ఉండుటవలన బలపడిన టిష్యూకు బయటకువచ్చే అవకాశము లేక పోవుటచే పాదాల లోపలి భాగములోనే పెరుగుతుంది. ఇవి విపరీతమైన బాధను కలిగిస్తాయి.

ఆనెకాయలతో బాధపడేవారు వైద్యుల సలహామేరకు "సర్జికల్ బ్లేడ్"తో వీటిని మొదలంటా కోసి, 10% "శాలిసిలిక్ యాసిడ్"తో బ్యాండేజ్ చేయించాలి. ఆనెకాయలు లేతగా ఉన్నప్పుడు "శాలిసిలిక్ యాసిడ్ ఆయింట్‌మెంట్" ఆనెకాయలమీదరాచి, "కారినాక్ (Corinac)" మందు క్రమముగా వాడి.... వీటిని నాశనము చేయవచ్చును.

## మొటిమలు (PIMPLES)

కొన్ని గ్రంధులు యౌవన కాలములో ఎక్కువగా పనిచేయుట వలన.... సహజముగా స్త్రీ- పురుషులిరువురిలోనూ మొటిమలు వస్తాయి. యీ మొటిమలు కొందరికి శోభను చేకూరిస్తే.... మరికొందరికి వికారాన్నిస్తాయి. మొటిమలు అధికముగా వచ్చేవారు- తీపి పదార్థాలు మరియు

క్రొవ్వు పదార్థములను వాడుట బాగా తగ్గించవలెను. రోజూ 4 లేక 5 సార్లు సబ్బుతో ముఖాన్ని శుభ్రము చేసికొంటుంటే- వాటిని ఎక్కువగా రాకుండా నివారించుకోవచ్చును.

యీ మొటిమలను గోళ్ళతో ఒత్తుట, గిల్లుట వంటివి చేస్తే.... "సెప్టిక్" అయ్యే ప్రమాదము చాల దగ్గరలో ఉంటుంది. పాకానికి వచ్చి బాగా బాధపెట్టే సమయాలలో- కొన్ని 'యాంటీబయాటిక్ ఆయింట్ మెంట్స్ రాస్తే.... చాలవరకు బాధ తగ్గిపోతుంది.

## తామర (RING WORM or a TINEA)

"ఫంగస్" ఇన్ఫెక్షన్ వలన వచ్చే తామరను "రింగ్‌వార్మ్" అని అంటారు. తామర కేవలము చర్మానికే కాదు.... గోళ్ళు, వెంట్రుకలకు కూడా వస్తుంది. గోళ్ళకు వచ్చినప్పుడు- "పుప్పిగోళ్ళు" ఏర్పడుట, వెంట్రుకలకు వస్తే- వెంట్రుకలు రాలిపోవుట జరుగుతుంది. ఎక్కువగా నీళ్ళలో తడిచే వారికి గోళ్ళ సందులలో పాచిపట్టినట్లు ఉంటుంది. ఒక విధమైన "ఫంగస్" వలననే ఇలా ఔతుంది.

చర్మము మీద వచ్చే తామర- "ఉంగరము"లా లోపల ఖాళీగా ఉండి, చుట్టూ గుండ్రముగా అల్లుకుపోతుంది. సాధారణముగా యీ తామర నడుము ప్రాంతములో ప్రారంభమై.... వివిధ ప్రాంతములకు ప్రాకుతుంది. కొన్ని రోజులకు తామర విపరీతముగా పెరిగిపోయి, యీ రింగ్స్ అన్నీ కలిసిపోయి, తేడా తెలియకుండా, నల్లగా, ఆఅచేతిని మించిన వెడల్పుతో గగ్గురు-గగ్గురుగా, చూచుటకు అసహ్యముగా, ఏనుగు చర్మములా తయారౌతుంది. ఇది విపరీతమైన దురదను కలిగిస్తుంది. తామర అంచులలో చిన్నచిన్న పొక్కులు లేచుట, పెచ్చులు కట్టుట, కొన్నిసార్లు చీము పొక్కులు వచ్చుటవంటి లక్షణాలు కనిపిస్తాయి. తామర చాల తేలికగా సంక్రమించే అంటువ్యాధి! తామర ఉన్న చోట గీకిన తరువాత ఆ గోళ్ళతో మరెక్కడ గోకినా తామర వెంటనే అంటుకొంటుంది. ఇది చాల మొండి చర్మవ్యాధి! పూర్తిగా తగ్గువరకు వైద్య సలహా మేరకు చర్మవ్యాధుల నివారణ మందులు వాడాలి. ఉదా॥ "గ్రిసో ఫిల్విన్" బిళ్ళలు రోజుకు మూడు చొప్పున ఒక నెల రోజులు

వాడుతూ.... 'డెరోబిన్ (Derobin)', "విట్‌ఫీల్", "మల్టీ ఫంగస్" వంటి ఆయింట్‌మెంట్స్; "స్కాబిజాన్ (Scabizan)", "మిటిగాల్ (Mitigal)" లాంటి తాపుత మందులు పై పూతగా వాడాలి.

## కుష్ఠు (LEPROSY) వ్యాధి - నివారణ

లెప్రసి "మైక్రో బాక్టీరియమ్ లెప్రా" అనే సూక్ష్మక్రిముల వలన వస్తుంది. ఈ వ్యాధి అంత తేలికగా అంటుకొని అంటువ్యాధి మాత్రము కాదు. దీనిలోనే రెండు రకాలు ఉన్నాయి. ఒక రకము కుష్ఠు (Tuberculold type) వ్యాధి నరములకు మాత్రమే సోకి- నరాలు లావెక్కి, చర్మము బండబారి పోతుంది. తిమ్మెర్లు మంట మొదలగు లక్షణాలతో మొదలౌతుంది. యీ వ్యాధితో ముక్కు చెవులు లావుగా తయారౌతాయి. తప్ప.... ఇది అంటువ్యాధి కాదు. రెండో రకము కుష్ఠు (Lepromatous type) పొడలు-పొడలుగా ఉండి, కాలి-చేతివ్రేళ్ళకు యీ వ్యాధి సోకి; పుళ్ళుపడి, రసి కారుచుండును. ఇది మాత్రమే అంటువ్యాధి. ఐతే యీ జబ్బు అతి సన్నిహితమైన–దీర్ఘ కాలిక సాంగత్యము వలన రెండు నుండి ఐదు సంవత్సరాల కాలములో మాత్రమే అంటుకొంటుంది గానీ: మామూలుగా ప్రజలు అనుకొనేట్లు అతి త్వరగా అంటుకొనే వ్యాధి మాత్రము కాదు– యీ "లెప్రసీ!" ఇవి కేవలము భయముతో కల్పించు కొన్న ఊహలే!!

యీ వ్యాధి తీవ్రదశలో లేనప్పుడు మీ ఫ్యామిలి డాక్టర్‌తో, మీ ఇంటిలో ఉండే- ట్రీట్‌మెంట్ చేయించుకోవచ్చును. భారతదేశము మొత్తములో మన "తెలుగుదేశము"లోనే యీ వ్యాధిగ్రస్తులు ఎక్కువగా ఉన్నారు. సక్రమమైన దీర్ఘకాల వైద్యముతో యీ "లెప్రసీ"ని అతి తేలికగా నిర్మూలించవచ్చును.

కుష్ఠువ్యాధిలో "డాప్సోన్", "సోలాప్సోన్", "గ్లూకోసల్ఫోన్", "సోడియా", "సల్ఫోక్సోన్ సోడియమ్", "తయాంబుటోసిన్", "తయాసిటోజోన్", "డిటోఫాల్" మందులను రోజుకు 12 1/2 mg. డోస్ నుండి మొదలుపెట్టి, 15 రోజులకొకసారి 12 1/2 mg. డోస్ పెంచుతూ- వంద మి॥గ్రా॥ల డోస్ వరకు పెంచి వాడుతూ ఉండాలి,

వ్యాధి తీవ్రతను బట్టి 12 నుండి 18 నెలలు యీ మందులను వాడాలి. ఉదా॥ : "డాప్సోన్ (Dapsone)" బిళ్ళలు 50 mg. 100 mg, "నోవోఫోన్ (Novophone)" 10 mg. నుండి 100 mg, బిళ్ళలు; "హైడ్నోకార్పస్ ఆయిల్ (Hydnocarpus Oil)", (E.C.C.O) ఇంజక్షన్ I.C.C. మొ॥నవి.

"లెప్రసీ"లో క్షయవ్యాధికి వాడే కొన్ని రకాల మందులను కూడ ఉపయోగిస్తారు. ఇవి కొద్దిగా పనిచేస్తాయి. ఉదా॥ I.N.H. రిఫాన్ఫిసిన్ (Rifanficin) గొట్టాలు, ఇథాంబుటాల్ (Ethambutol) బిళ్ళలు!

చాల పూర్వకాలము నుండి కుష్ఠు వ్యాధికి "చాల్మూగ్ర" నూనెను ముఖ్యమైన మందుగా మనదేశములోని వైద్యులు ఉపయోగిస్తున్నారు.

ప్రతి క్వాలిఫైడ్ డాక్టర్ "లెప్రసీ"కి వైద్యము చేస్తాడు. వైద్యుల పర్యవేక్షణలో– కుష్ఠును లేతగా ఉన్నప్పుడే, వారు చెప్పినట్లు మందులు వాడి, తేలికగా నిర్మూలించుకోవచ్చును.

# చర్మవ్యాధులు రాకుండా తీసికోవలసిన జాగ్రత్తలు

## (గజ్జి, చిడుము, ఎగ్జిమా మొ॥నవి)

ఏ చర్మవ్యాధి వచ్చుటకైనా.... ముఖ్యమైన కారణము- పరిశుభ్రత లోపించుటయే! అంతేకాకుండా.... ఎవరికైనా గజ్జి, చిడుము లాంటి చర్మవ్యాధులు వచ్చినపుడు వారివి రాచుకు-పూచుకు తిరుగుట వలన కూడా చర్మవ్యాధులు తేలికగా వచ్చే అవకాశమున్నది. చర్మవ్యాధులు వచ్చిన వారి- వస్తువులు, బట్టలు తాకకుండా విడిగా పెట్టించి; వారికి వెంటనే వైద్యము చేయించాలి.

ముఖ్యముగా చర్మవ్యాధులు రాకుండా ఉండాలంటే- మనల్నే కాకుండా.... మన చుట్టూ ఉన్న పరిసరాలను కూడా పరిశుభ్రముగా ఉంచుకోవాలి. ప్రతిరోజూ రెండుపూటలా మెడికేటెడ్ సోప్‌తో స్నానము చేయాలి! స్నానము చేసిన ప్రతిసారీ పరిశుభ్రముగా ఉతికిన బట్టలనే వాడాలి. ఆ బట్టలు కూడా మురికినీటి చెరువులలో, కాలువ గట్లలో ఉతకరాదు. మంచినీటితో ఉతికినవే ధరించాలి. మంచినీటిలో ఉతికే అవకాశములేనివారు- త్రాగునీరుగాని, ఉతుకు నీరుగాని– బాగా కాచి,

వాడుకోవాలి. ఎండాకాలములో ఐతే.... రోజుకి 4 లేక 5 సార్లు స్నానము చేసి, నైసిల్ లాంటి పౌడర్‌ను శరీరమంతా రాసుకోవాలి. ఇలాంటి జాగ్రత్తలను విధిగా పాటించే వారికి చర్మవ్యాధులు దూరముగా ఉంటాయి.

# సెక్స్ వ్యాధులు - నివారణ

సుఖవ్యాధులు- నైతిక ప్రవర్తనలేని లైంగిక సంపర్కాల వలన ఎక్కువగా వస్తాయి. కొందఱు "సినిమాహాల్స్, ఇతర కామన్ యూరినల్ దొడ్లలో మూత్ర విసర్జన చేస్తే.... సుఖవ్యాధులు సంక్రమిస్తాయ"ని చెబుతుంటారు. ఇది వట్టి అపోహ మాత్రమే! సుఖవ్యాధులు లైంగిక సంపర్కము లేనిదే వచ్చే అవకాశమే లేదు. ఈ వ్యాధులు వచ్చుటకు ముఖ్యమైన కారణము వ్యాధులున్న వారితో విచ్చలవిడిగా.... సంపర్కము చేయటమే! జలుబు, గజ్జి, తామర లాగా- సుఖవ్యాధులున్న వారిని అంటుకొంటేనో.... వారి బట్టలు వేసుకొంటేనో.... వారి ఉమ్మి తుంపరలు పడితేనో.... వారు మూత్రము పోసిన ప్రదేశాలలో మూత్రము పోస్తేనో.... సుఖవ్యాధులు రావు! కేవలము లైంగిక సంపర్కము వలన మాత్రమే ఈ సుఖవ్యాధులు వస్తాయి. ఐతే.... ఇటీవలి కాలములో- ప్రపంచ ప్రజలను విపరీతముగా భయభ్రాంతులను చేస్తున్న "ఎయిడ్స్" అనే వ్యాధి.... నోరు, పెదాలపైన ఉన్న సిఫిలిస్ వలన; పుండ్లువున్న వారి చుంబనము వలన కూడా సంభవిస్తున్నది. కొంతమంది.... "సుఖవ్యాధి అక్రమ లైంగిక సంపర్కము వలన వచ్చినదని తెలిస్తే- తోటి వారిలో అవమానమ"ని భావించి; ఫలానా చోట "మూత్ర విసర్జన చేస్తే ఈ వ్యాధి సంక్రమించినద"ని చెబుతుంటారు. ఇటువంటి మనుషుల వలన మాత్రమే ఈ మాటలు ప్రచారములోకి వచ్చాయి కాని.... అంతకుమించి ఏమీలేదు. ఈ వ్యాధులు స్త్రీ-పురుషులలో ఎవరికి ఉన్నా మరొకరికి తేలికగా సంక్రమిస్తాయి. సుఖవ్యాధులు రావడానికి అనేకసార్లు ఆ వ్యాధి ఉన్నవారితో సంభోగము చేయనక్కరలేదు. వ్యాధులు అంటుకొనుటకు.... ఒక్కసారి

పొల్గొన్నా చాలు! సుఖవ్యాధులలో అనేక రకాలైన వ్యాధులున్నాయి. స్త్రీ మర్మస్థానములో గాని, పురుషుల మర్మాంగము మీద గానీ పరిశుభ్రత లేకపోతే పుండ్లు తామర లాంటి మామూలు చర్మవ్యాధులు వచ్చుటకు అవకాశమున్నది. ఇన్ ఫెక్షన్ వలన వచ్చే మామూలు కురుపులు, పుళ్ళలాంటివి చూచి కూడా కొందరు సుఖవ్యాధులని భ్రమ పడతారు.

ఇటువంటి అనుమానము రాగానే క్వాలిఫైడ్ డాక్టర్స్‌ని సంప్రదిస్తే.... వారు అనేక రకాల టెస్ట్‌ల ద్వారా "సుఖవ్యాధులా ? కాదా ??" అని నిర్ణయించుకొని, వాటికి తగిన మందులు వాడి నివారిస్తారు.

## గనోరియా (GONORRHEA "సెగవ్యాధి")

గనోరియా వ్యాధి సోకిన పురుషునికి తొలిదశలో మూత్రనాళము యొక్క రంధ్రము దగ్గర దురద-మంట ఉంటాయి. మూత్రము ఎక్కువగా విసర్జించాలనుకొనుట; మూత్రద్వారము నుండి దుర్వాసనతో కూడిన చిక్కని, జిగటగా పసుపు పచ్చ ద్రవము కారుతూ ఉంటుంది. గనోరియా- లైంగిక సంబంధము వలన "గోనోకోకస్" అనే బాక్టీరియా క్రిమి వలన వస్తుంది. ఈ వ్యాధిని అశ్రద్ధచేస్తే.... విదానముగా- రక్తము లోకి ప్రవేశించిన రోగక్రిములు- మూత్రపిండాలను, మూత్రకోశాలను వ్యాధిగ్రస్తము చేసి, మెదడులోకి ప్రవేశించి "గోనోకోకస్ మెనింజైటిస్" అనే తీవ్ర వ్యాధిని కలిగిస్తాయి. స్త్రీలకు- ఈ గనోరియా వ్యాధి లక్షణాలు వెంటనే కనబడవు. అంతేకాదు.... వ్యాధి లక్షణాలు బయటపడినా అంతగా బాధలు ఉండవు. కొందరు స్త్రీలు-మగవారివలెనే బాధలు అనుభవిస్తారు. ఐతే గనోరియా సోకిన స్త్రీలకు గర్భాశయ కంఠము ఉబ్బుట దానికి రెండు వైపుల ఉండే అండ వాహిక, ప్రేగులు వాచిపోయి- నొప్పిగా ఉండుట; యోనిలో మంట-దురద; మూత్రనాళము నుండి, యోని నుండి పచ్చగా చిక్కని జిగట ద్రవము డిశ్చార్జ్ అగుట లాంటి లక్షణాలు ఉంటాయి.

గనోరియా ఉన్న స్త్రీలకు పిల్లలు పుడితే- పుట్టిన పిల్లలకు ఒక రోజులోనే కళ్ళకి ఈ వ్యాధి సోకి- కనురెప్పలు వాచుట, చీము

కొలుట, పుసులు విపరీతముగా వచ్చుట జరుగుతుంది. గర్భాశయము నుండి శిశువు బయటపడే సమయములో యోని మార్గములోవున్న వ్యాధి క్రిములు శిశువు కంటిలోనికి జేరి పై లక్షణాలు కనిపిస్తాయి. కాన్పు ఐన వెంటనే బేబీకి కళ్లు తుడిచి "పెనిసిలిన్" చుక్కలు కళ్ళలోవేస్తే ఈ వ్యాధి వలన కళ్ళకు జరిగే అనర్థాలను నివారించవచ్చు. పసివారికి ఈ వ్యాధి లక్షణాలు కనబడగానే వెంటనే సరైన చికిత్స చేయించాలి. లేక పోతే నల్లగ్రుడ్డుమీద పుండ్లు పడి, అంధత్వము ప్రాప్తించవచ్చును.

గనోరియా వ్యాధికి ఈ రోజులలో చక్కని మందులు ఉన్నాయి: ఈ వ్యాధిని వైద్యులు నిర్ధారించుటకు మూత్రనాళము నుండి వచ్చే చీము లాంటి చిక్కని ద్రవాన్ని పరీక్షచేసి "వ్యాధి ఉన్నదీ-లేనిదీ" తెలిసి కొంటారు. వారి పర్యవేక్షణలో యాంటీబయాటిక్ మందులు వాడాలి! (ఉదా॥ 'పెనిసిలిన్' 6,00,000 యూనిట్స్-ఇంజక్షన్‌లు మూజురోజులు చేయించుకుంటే ఈ వ్యాధి తగ్గుతుంది. పెనిసిలిన్ "ఎలర్జీ" వున్న వారికి "జెంటామైసిన్" (Gentamycin) ఇంజక్షన్స్ చేయించినా తగ్గి పోతుంది. ఇంజక్షన్స్ వద్దనుకొంటే "డాక్సిసైక్లిన్ (Doxyeycline)", "నెగఫ్లాక్స్ (Negaflox)" గొట్టాలు ఆహారము తిన్న తరువాత వేసి కోవాలి. "మినిసైక్లిన్" గొట్టాలు "మార్డిడాక్స్" గొట్టాలు కూడా పై మాదిరిగానే వాడవచ్చు. ఇవేగాక "ఎరిత్రోమైసిన్"- 250 mg. బిళ్ళలు "టెరామైసిన్" గొట్టాలు, "టెట్రాసైక్లిన్" గొట్టాలు మూడింటిలో ఏదో ఒక మందు ప్రతి ఆరు గంటలకు రెండు గొట్టాల (రెండు బిళ్ళల) చొప్పున రెండు రోజులు వాడినా పూర్తి ఫలితము వస్తుంది.

పై మందులు వాడుతూ "ఆల్కహాల్" అలవాటు ఉన్నవారు వాటికి దూరముగా ఉంటూ.... మంచినీరును విపరీతముగా త్రాగుతూ.... పూర్తి వైద్యము చేయించుకొని, ఈ వ్యాధిని దూరము చేసికోవాలి. (వ్యాధి సోకినవారు వివాహితులైతే దంపతు లిరువురూ పరీక్షలు జరి పించుకొని తగిన వైద్య సహాయాన్ని పొందాలి.)

## సిఫిలిస్ (SYPHILES "కొరుకు వ్యాధి")

"ట్రెపోనెమా పాల్లిడమ్" అనే సూక్ష్మక్రిమి ద్వారా సంక్రమించే ఈ "సిఫిలిస్"- లైంగిక సంబంధము ద్వారా అతి తేలికగా అంటుకొంటుందేగానీ-త్వరగా మాత్రము పోదు. యీ వ్యాధి సోకిన వారికి జననాంగాలమీద (స్త్రీ పురుషులలో ఎవరికైనా) "షాంకర్" అనే చిన్న పుండు పడుతుంది. ఇది పెసరబద్ద సైజ్‌లో వుండి, త్వరగా పెరిగి, పేంట్ గుండీ సైజ్‌కి తయారవుతుంది. కొందరిలో ఇంకొంచెము పెద్దగానూ వుండవచ్చు. ఇది చూచుటకు పుండేగాని, ఒత్తిచూస్తే మాత్రము గట్టిగా వుండి, ఏ మాత్రము నొప్పి వుండదు. యీ పుండునుంచి పల్చని ద్రవము కారుతూ.... ఇది దుర్వాసనవేస్తూ వుంటుంది. దీన్ని నిర్లక్ష్యము చేస్తే 20 నుండి 60 రోజుల లోపు మానిపోయి; చిన్న చారగా మాత్రమే మిగులుతుంది. ఇక్కడే చాలమంది యీ వ్యాధి పోయిందని భ్రమపడుతుంటారు. కానీ.... "సిఫిలిస్" తన విశ్వరూపముతో బయటకు వచ్చుటకు మార్గాన్ని సుగమము చేసికొంటుంది. ఇక్కడ నుండి సిఫిలిస్ మూడు నుండి పది సంవత్సరాలలో తన రెండు-మూడు దశలను బయటవేస్తుంది. (ఐతే.... "పెనిసిలిన్" అందుబాటులోకి వచ్చాక సిఫిలిస్ యొక్క రెండు-మూడు దశలు యీ కాలములో పెద్దగాలేవనే చెప్పాలి.)

సిఫిలిస్ రెండవదశలో.... గులాబి రంగులో వుండే దద్దురు-కాళ్ళు, చేతులు, పొట్ట, ఛాతి అనిగాక.... ఎక్కడైనా రావచ్చును. యీ దద్దురు పావు అంగుళము నుండి అర అంగుళము పరిమాణములో ఉండవచ్చును. కొందరికి దద్దురుపోయి, దాని స్థానములో చీము పొక్కులు రావచ్చును. కొందరికి వెంట్రుకలు రాలిపోయి బట్టతల రావచ్చు. మరి కొందరికి పెదవుల పైన, అంగిట్లో, టాన్సిల్స్ దగ్గర సన్నటిపొరదళసరిగా తయారై వ్యాధిగ్రస్తముగా వుంటుంది. మెడ వెనుక, చంకలలో, ఇంకా ఇతరచోట్ల "లింఫ్‌గ్లాండ్స్" ఉబ్బుతాయి. కాని.... వీటివలన ఎలాంటి బాధలుండవు. సిఫిలిస్ రెండవ దశలో.... వ్యాధి తీవ్రతను బట్టి అనేక రకాలుగా దీని లక్షణాలు ఉండవచ్చును. మెదడు, కళ్ళు, లివర్,

వృషణాలు, రక్తనాళాలు, గుండె అనునవి వ్యాధికి గురిఅగుట జరుగు తుంది. కొందఱికి కీళ్ళవాపు వచ్చి నీరు చేరుట, రాత్రులు మోకాళ్ళ ఎముక లలోతొంటి ఎముకలలో పోట్లు; చలితోకూడిన జ్వరము, తలనొప్పి, ఆకలి మందగించుట ఇలా ఎన్నోరకాల పరిణామాలు ఈ సిఫిలిస్ వ్యాధిలో కనిపిస్తాయి.

ఇక భయంకరమైన ఈ "సవాయి" మూడవదశలో.... సెనగగింజ సైజ్ నుండి కుంకుడుగింజ సైజ్‌లో నొప్పిలేని గడ్డలు శరీరము పైన గానీ, లోపలగానీ అనేకము వస్తాయి. ఇవి చివరిదశలో పగిలి, లోపల నుండి జిగురులాంటి పదార్థము వస్తుంది. ఇందువలన శరీరములోని ఇతర అంగాలు చాల దెబ్బతింటాయి. ఇటువంటి గడ్డ- అంగిట్లో వచ్చిన దంటే.... బయట నుండి గొంతు లోపలికి కన్నము పడుతుంది. ఇంకా ఈ వ్యాధి వలన గుండెలోని రక్తనాళాలు కొన్ని ప్రదేశాలలో సన్నబడి పగులుట, గుండె పెరుగుట, వెన్నుపూసలోని నాడీ మండలము చెడి పోయి "పెరాలిసిస్" వచ్చుటకు జరుగుతుంది.

ఈ వ్యాధిలో అతి ముఖ్యమైన లక్షణము ఒకటి ఉంది. అదేమి టంటే- యీ సిఫిలిస్ వలన కేంద్ర నాడీమండలము దెబ్బతిన్న కొంద ఱిలో విచిత్రమైన భ్రమలు-భ్రాంతులు కలిగి, కళ్ళముందు వెలుగులు కనిపిస్తాయి. చెవులలో - అనేక తీవ్ర శబ్దాలు వినిపిస్తాయి. మరికొందఱికి భయంకర రూపాలు, పిచ్చి పిచ్చి ఊహలతో కూడిన దృశ్యాలు కని పిస్తాయి. స్త్రీలలో యీ వ్యాధి జీర్ణించుకుపోయి వుంటే- వారికి గర్భము నిలువక తఱచుగా గర్భస్రావాలు జరుగుతాయి. ఇలా కొన్నిసార్లు జరిగి, పిండము నిలబడి, వ్యాధిగ్రస్తమైన శిశువులను కనుట లేక పుట్టిన తర్వాత కొన్ని గంటలకో.... కొన్ని రోజులకో.... ఆ శిశువు మృతిచెందుట జరుగుతుంది. సిఫిలిస్ వ్యాధి సోకిన బిడ్డలు వికృతముగా- చర్మము ఊడిపోయి, బొబ్బలు తేలి, అనేక రకాలుగా పుడతారు. ఇలా కొందఱు శిశువులు పుట్టి పోయిన తర్వాత.... సిఫిలిస్ లక్షణాలు ఏమీ కనిపించ కుండా శిశువు పుట్టి- పెరిగినా.... ఆ శిశువుకు వయసు పెరిగిన తర్వాత యీ లక్షణాలు బయటపడతాయి.

సిఫిలిస్ వ్యాధి సోకినవారు మొదటి దశలోనే పట్టభద్రులైన వైద్యుల సలహాల ననుసరించి- V.D.R.L. రక్తపరీక్ష చేయించుకొని వ్యాధి నిర్ధారణ కాగానే.... నీటిలో కొంచెము "డెట్టాల్" వేసికొని మర్మాంగాలని పరిశుభ్రముగా కడిగివేయాలి తదుపరి "యాంటీబయోటిక్" మందులు వాడుతూ.... సంవత్సరము మీద ఆరు నెలల కాలము దీనిని కనిపెడుతూ వుండాలి. ఉదా॥ : దీర్ఘకాలము పనిచేసే "Peni deere La 24" ఇంజక్షన్ ఒకటి- రెండు తొంటెలకు చేయించుకొంటే సరిపోతుంది. అలాగాక ఇంజక్షన్ పడనివారు క్లాక్సిలిన్ (Cloxa cillin) గొట్టాలు, ఎమాక్సిసిలిన్ (Amoxicillin) గొట్టాలు, ప్రతి ఆరు గంటలకు రెండు గొట్టాలు చొ॥న పదిరోజులు వేసికోవాలి. ఇంకా "టెట్రాసైక్లిన్" గొట్టాలు, "క్లోరోమైసిటిన్" గొట్టాలు కూడా పై మాదిరిగా దానికి మారుగా వాడవచ్చును. ఇన్ని గొట్టాలేసుకొనుట విసుగు అనుకొనేవారు- "మినీసైక్లిన్" గొట్టాలు ప్రొద్దున ఒకటి, సాయంత్రము ఒకటి వేసికొంటూ 14 రోజులు వాడాలి. అవసరాన్ని బట్టి 10 రోజులాగి మళ్ళీ అదే విధముగా 14 రోజులు వాడితే సరిపోతుంది. "మార్డిడాక్స్" గొట్టాలు గూడా.... "మినిసైక్లిన్" గొట్టాలవలెనే వాడవచ్చును. పైన చెప్పుకొన్న వైద్యమంతా సిఫిలిస్ మొదటి దశలో మాత్రమే! వ్యాధి తీవ్రతనుబట్టి డోస్ పెంచవలసిన అవసర ముంటుంది. వ్యాధికి మందు వాడినా- ప్రతినెలా V.D.R.L. రక్తపరీక్ష ఆరు నెలల వరకు చెయ్యాలి. అవసరమైతే వెన్ను నుండి నీరుతీసి టెస్ట్ జరిపించాలి. ఈ వ్యాధి సోకినవారు దంపతులైతే ఇరువురూ కూడా వైద్య పర్యవేక్షణలో చికిత్స పొందాలి.

సిఫిలిస్ రాకుండా కొందరు "సున్తీ" చేయించుకొంటారు. ఇది అజ్ఞానముతో కూడుకొన్న అతి తెలివి ఊహేకాని నిజము కాదు ఎందుకంటే.... ఎక్కువగా ఈ వ్యాధి పురుషుల మర్మాంగము ముందు భాగములో ముందు వెనుకలకు కదిలే చర్మము మీద వచ్చుట నిజమే కాని ఆ చర్మమే లేకపోతే సిఫిలిస్ పుండు "శిశ్నము" మీద ఏర్పడుతుంది. లేదా మర్మాంగము మీద ఎక్కడైనా ఏర్పడవచ్చు ఈ వ్యాధి క్రిములు

శరీరములో ప్రవేశించిన 10 రోజుల నుంచి మూడు నెలల లోపులో ఎప్పుడైనా బయటపడే ఈ సిఫిలిస్ సుస్తీ చేయించుకొన్నా- మొదటి దశలో ఉండే పుండు లేకుండా, ఒక్కసారే రెండవదశ లక్షణాలతో బయటపడినా ఆశ్చర్యపోనక్కరలేదు.

## ఫిరంగి పుండు (SHANKER)

"హేమోఫిలస్ డుక్రి" అనే బాక్టీరియా క్రిమి వలన సంభవించే ఈ వ్యాధి ఉన్నవారితో- లైంగిక సంపర్కము జరిగిన మూడు నుంచి ఆరు రోజులలోపు ఈ వ్యాధి లక్షణాలు బయటపడతాయి. అరుదుగా కొందరిలో ఒక రోజులోనే కనిపించవచ్చు. స్త్రీ-పురుషులలో ఎవరికైనా దీని బాధ ఒకటే! మొదట్లో ఈ వ్యాధి సోకినప్పుడు అంగముమీద చిన్న పొక్కు కనిపించి, కొన్ని గంటలలోనే పగిలిపోతుంది. పగిలిన చోట పుండుపడి చాల నొప్పిగా ఉంటుంది. గుడ్డ తగిలినా ప్రాణము పోయేంత బాధ కలుగుతుంది. శిశ్నముమీద చర్మము కదలినా విపరీతమైన నొప్పి వుంటుంది. పుండు చుట్టూ ఎఱ్ఱగా వాచిపోతుంది. పుండులోనుండి పసుపు పచ్చని రసికారి, అది తగిలిన ప్రతిచోట పుండ్లులేస్తాయి. ఈ పుండ్లు ఏర్పడిన రెండు-మూడు రోజులలో గజ్జలలో బిళ్ళలు కడతాయి. ఆ బిళ్ళలు ఎఱ్ఱగా వాచి పెద్ద గడ్డగా మారి, విపరీతమైన నొప్పితో—జ్వరము వస్తుంది. ఆ గడ్డ మెత్తబడిపోయి- పగిలి, రసి కారుతూ వుంటుంది. కొందరికి పురుషాంగము మీద చర్మము కదలకుండా వుంటుంది. మరికొందరికి మూత్రనాళము కుదించుకుపోతుంది.

ఈ వ్యాధి సోకినవారు వెంటనే క్వాలిఫైడ్ డాక్టర్‌ను సంప్రదించి షాంకరాయిడ్ పుండును డెట్టాల్ లోషన్ నీటితో శుభ్రముగా కడిగి, బోరిక్ పౌడర్ అద్దాలి. తర్వాత "యాంటీబయాటిక్" మందులు వాడాలి. ఉదా॥ : స్ట్రెప్టోమైసిన్ (Streptomycin)-1 mg. ఇంజక్షన్ రోజుకొకటి చొప్పున వారముగానీ, పది రోజులుగానీ చేయించుకొంటే సరిపోతుంది. ఇది పడనివారు "సల్ఫాడైజిన్" బిళ్ళలు ప్రతి ఆరు గంటలకు రెండేసి చొప్పున 10 నుండి 15 రోజులు వాడినా సరిపోతుంది.

ఇంకా తేలికగా వాడాలనుకొనేవారు "మార్డిడాక్స్" గొట్టాలు రోజుకు రెండు చొప్పున 5 రోజులు వాడితే సరిపోతుంది. "జెస్టిసిన్" గొట్టాలు కూడా "మార్డిడాక్స్" గొట్టాలవలే వాడవచ్చును. ఇంకా "టెట్రాసైక్లిన్" "క్లోరోమైసిన్", "టెర్రామైసిన్" గొట్టాలలో ఏదో ఒక రకము ప్రతి ఆరు గంటలకొకటి చొ॥న షాంకరాయిడ్ వ్యాధి పూర్తిగా నివారించబడే వరకు వాడాలి. ఈ వ్యాధి వలన-పుట్టే సంతానములో ఎలాంటి లోపాలు రావు వివాహితులైనవారికి ఏ ఒక్కరికి ఈ వ్యాధి సోకినప్పటికీ దంపతులిరువురు చికిత్స చేయించుకొనుట అవసరము!

## అడ్డకఱ్ఱలు (Lymphogranuloma venereum)

లైంగిక సంపర్కము వలన వచ్చే ఈ "Lg V." అనే వ్యాధి ఒక రకమైన "వైరస్" క్రిమి వలన వస్తుంది. వ్యాధి వున్నవారితో సంపర్కము జరిగిన వారము రోజుల లోపుగా దీని లక్షణాలు బయట పడతాయి ఈ వ్యాధి బయటపడిన మొదటి దశలో మర్మాంగము మీద చిన్న కురుపులాగా పుట్టి, కొన్ని రోజులలో (లేక వారములలో) గజ్జల యందు బిళ్ళలు కడతాయి. ఈ సుఖవ్యాధిలో ఎక్కువగా ఒకవైపు గజ్జలలోనే బిళ్ళ కడుతుంది. అరుదుగా కొందరిలో రెండు వైపులా బిళ్ళలు కట్టవచ్చు. ఈ బిళ్ళలు వాచిపోయి, బాగా నొప్పి వుంది, పక్వానికి వచ్చి- ఆ బిళ్ళలకు చాలాచోట్ల చిన్న చిన్న బొక్కలుపడి- వాటిలో నుండి చీము-రక్తము కలిసిన రసి కారుతుంది. కొన్ని సమయాలలో చలిజ్వరము, ఆకలిలేమి, తలనొప్పి, బరువు తగ్గటం లాంటివి వుంటాయి. ఈ దశలో సరైన చికిత్స జరుగకపోతే.... మల ద్వారము బిగుసుకొని విరేచన బాధలు కలుగుతాయి. దీని రెండవ దశ ఒక సం॥ నుండి, 3 సం॥ల వరకు పట్టవచ్చు. స్త్రీలలో ఈ వ్యాధి మొదటి దశ లక్షణాలు కనిపించకుండా- ఏకముగా రెండవదశ లక్షణాలతోనే బయట పడుతుంది. ఈ దశలో స్త్రీల యోనికి, మల ద్వారానికి మధ్య రంధ్రము పడి మలము యోనినుండి కూడా వస్తుంది. Lg V. వలన కొన్నిసార్లు పాదాలు, మోకాళ్ళలో బోద వచ్చినట్లుగా వాపు వస్తుంది. మరి కొంద రిలో జననేంద్రియాల దగ్గర నీరు చేరుతుంది.

ఈ వ్యాధి సోకిన వెంటనే పట్టభద్రులైన వైద్యులను సంప్రదించి, పుండును డెట్టాల్‌తో శుభ్రముగా కడిగి, యాంటీబయాటిక్ పౌడర్‌ను పుండు వున్న స్థానములో అద్దాలి. తరువాత "యాంటీబయాటిక్" మందులు జాగ్రత్తగా వాడి Lg. V. వ్యాధిని నిర్మూలించాలి. ఉదా॥ "స్ట్రెప్టోమైసిన్" 1 mg. ఇంజక్షన్‌లు- ప్రతిరోజూ ప్రతి ఐదు గంటల కొకటి చొ॥న ఐదురోజులు వాడితే సరిపోతుంది. ఇంజక్షన్‌లు పడనివారు- "క్లోరోమైసిన్" గొట్టాలు ప్రతి ఆరు గంటల కొకటి చొ॥న రెండు వారాలు వాడినా సరిపోతుంది. పై మాదిరిగానే- "టెట్రామైసిన్" "ఆరోమైసిన్" గొట్టాలలో ఏదో ఒకరకము వాడవచ్చును. దంపతులైతే ఇరువురూ పరీక్షలు చేయించుకొని తగిన చికిత్స పొందుట మఱచిపోరాదు.

# ఇంకా-కొన్ని సుఖ వ్యాధులు

## గ్రాన్యులోమా ఇంగ్వాయినాలె
## (GRANULOMA INGUINALE)

ఈ వ్యాధిని "గ్రాన్యులోనో వెనిరియమ్" అని కూడా వైద్యులంటారు. లైంగిక సంపర్కము వలన మాత్రమే ఏర్పడే ఈ వ్యాధి ప్రారంభములో జననేంద్రియాలమీద- ఎర్రటి పొక్కులుపుట్టి, చితికి, పుండ్లుపడి, వీటినుండి దుర్వాసనతో కూడిన రసి కారి; అది అంటిన చోటల్లా ఖాళీలేకుండా ఎఱ్ఱటి పుండ్లుపడి- జననేంద్రియాలు, తొడలు మొత్తము అంతా ఒకే పెద్ద పుండులాగ తయారౌతుంది. కొన్ని సమయాలలో ఈ పుండు ఎండిపోయి, చెక్కుకట్టి- తిరిగి అందులో నుండి రసి కారుతుంది. కొన్ని సందర్భాలలో ఈ పుండు వలన మూత్రపిండాలు, మూత్రకోశము, మూత్రనాళము పాడైపోతాయి. స్త్రీలకు కూడా ఈ వ్యాధి లక్షణాలు పురుషులలో వలెనే వుంటాయి.

ఈ వ్యాధి సోకినదని అనుమానము వచ్చిన వెంటనే పట్టభద్రులైన వైద్యుల పర్యవేక్షణలో పుండు వున్న ప్రదేశానికి యాంటీబయాటిక్ ఆయింట్‌మెంట్ రాయాలి. "యాంటీబయాటిక్" మందులు జాగ్రత్తగా వాడి ఈ వ్యాధిని తగ్గించుకోవాలి. ఉదా॥ "స్ట్రెప్టోమైసిన్" 1 mg. ఇంజక్షన్‌లు ప్రతి ఆరు గంటల కొకటి చొ॥న ఆరు రోజులు

చేయించుకొంటే సరిపోతుంది. ఇది పడనివారు "టెర్రామైసిన్" గొట్టాలు ప్రతి ఆరు గంటలకు- రెండు చొప్పున, రెండు వారాలు వాడినా సరి పోతుంది ఇంకా "ఎరోమైసిన్" గొట్టాలు, "క్లోరోమైసిన్" గొట్టాలు ఏదో ఒక రకము "టెర్రామైసిన్" గొట్టాలలాగే వాడవచ్చును. ఈ వ్యాధికి దంపతులైతే ఇరువురూ చికిత్స పొందాలి.

## వెనీరియల్ వార్ట్స్ (VENEREAL WORTS)

శిశ్నము చుట్టూ ఉన్న గాడిలో పులిపిరి కాయలవలె గుండ్ర ముగా, మెత్తగా ఉండే ఈ వ్యాధి ఒక రకమైన "వైరస్" వలన వస్తుంది. యీ వ్యాధి ఎక్కువగా సంపర్కము వలన వస్తుంది. ఐతే.... కొన్ని సందర్భాలలో సంపర్కము లేకుండా కూడా రావచ్చు. యీ కాయలు తడిగా, మెత్తగా ఉండి వీటినుండి స్రవించే ద్రవము దుర్వా సన కలిగి వుంటుంది. లైంగిక సంపర్కము వలన అంటు వ్యాధిగా ఇది సోకినా- దీనివలన ఆరోగ్యానికి ఎటువంటి అంతరాయము కలు గదు. యువతీ- యువకులలో వచ్చే యీ వ్యాధి కొన్ని సమయాలలో పిల్లలకు కూడా సంక్రమిస్తుంది. ఇది జననేంద్రియాల మీదే రావాలని లేదు మల ద్వారము దగ్గఱ కూడా రావచ్చు.

యీ వెనీరియల్ వార్ట్స్ గుత్తులు-గుత్తులుగా ఉన్నవారు వైద్య పర్యవేక్షణలో శస్త్రచికిత్స చేయించి తొలగించుకోవాలి. కాయలు తక్కు వగా ఉండేవారు ముందుగా కాయలున్నచోట శుభ్రముగా కడిగి "పోడో ఫిల్లిన్" ద్రవము పైపూతగా రాసి, అరగంట ఆరనిచ్చి, మళ్ళీ నీటితో కడగాలి. రోజుకు రెండుసార్లు ఇలా చేస్తూ- రెండు రోజులు పోడోఫిల్లిన్ మందు వాడితే వార్ట్స్ రాలిపోతాయి.

## హెర్పెస్ ప్రిప్యుటియాలిస్
## (HERPES PRAEPUTIALIS)

లైంగిక సంపర్కము వలన వచ్చే యీ వ్యాధికి సరియైన మందులు లేవనే చెప్పాలి. యీ వ్యాధి సంబంధిత వైరస్ క్రిమి శరీర ములో ప్రవేశించిన వారము రోజులలో బయటపడుతుంది. యీ వ్యాధి సోకిన వారి మర్మావయవముల మీద చర్మము ఎఱ్ఱగామారి, ఆ ప్రదేశ

ములో నీరు పొక్కులు వస్తాయి. కొద్ది గంటలలో పొక్కులు చితికి, చిన్న పుళ్ళులాగా మారిపోతాయి. వీటివలన విపరీతమైన బాధ కలుగుతుంది. జ్వరము కూడా రావచ్చు. అరుదుగా కొందరిలో మర్మాంగాల మీదనే గాక.... నోట్లో, మరికొందరికి ముఖముమీద కూడా పొక్కులు లేస్తాయి. అవి కూడా కొంచెము సేపటిలో పగిలి, బాధ కలిగిస్తాయి. కొందరిలో ఈ లక్షణాలు తరుచుగా వస్తుంటాయి.

మర్మాంగాల మీద పుళ్ళు పడినప్పుడు వైద్య పర్యవేక్షణలో— శుభ్రముగా కడిగి, పై పూతగా హెర్పెక్స (Herpex) ఆయింట్ మెంట్‌ను రెండు పూటలా రాయాలి. వ్యాధి విపరీతముగా వున్నవారు వైద్యుల పర్యవేక్షణలో ఉండి, వారు చెప్పినట్లుగా జాగ్రత్త చర్యలు తీసికోవాలి.

## ఎయిడ్స్ (AIDS = Acquired Immune Deficiency Syndrome)

గత 15 సం॥ల నుండి ప్రపంచ ప్రజలను ఆందోళన పాలు జేస్తున్న వ్యాధి ఎయిడ్స్! "హెచ్. ఐ. వి (H. I. V. = హ్యూమన్ ఇమ్యునో డెఫిసియన్సి వైరస్)" అను వైరస్ శరీరములోనికి ప్రవేశించి, వ్యాధి నిరోధ కణాలను పుట్టించే.... T. సెల్స్‌ను నాశనము చేస్తాయి. దీనితో మన శరీరములోని 'వ్యాధి నిరోధక శక్తి' సమూలముగా కూలిపోతుంది. రక్తములోనూ, వీర్యములోనూ, యోని స్రావాలలోనూ H. I. V. క్రిములు అధికముగా వుంటాయి.

## ఎయిడ్స్ వచ్చే అవకాశాలు

1) H. I. V. ఉన్నవారితో సంపర్కము వలన; 2) H. I. V. ఉన్నవారి రక్తము ఎక్కించినపుడు; 3) H. I. V. ఉన్నవారికి ఉపయోగించిన సిరంజ్‌లు, నీడిల్స్‌తో ఇంజక్షన్స్ చేయుట వలన; 4) H.I.V. తల్లి వలన కడుపులోని బిడ్డకు ఎయిడ్స్ వ్యాధి సోకుతున్నట్లు రుజువైనది. ప్రపంచ ఆరోగ్య సంస్థవారి సర్వే ప్రకారము ఇప్పటికి 180 దేశాలలో ఎయిడ్స్ వ్యాధి ఉన్నట్లు తేలింది. అందుకే.... దీన్ని సర్వజనులకు వచ్చేదు (Pandemic) వ్యాధిగా చెబుతారు.

H. I. V. క్రిములు శరీరములో ప్రవేశించినది మొదలు ఎయిడ్స్ వ్యాధి లక్షణాల స్థితి (అనేక వ్యాధుల సముదాయము) కనిపించుటకు 8 సం॥ల నుండి 10 సం॥లు పట్టవచ్చును. ఎయిడ్స్ వున్న వ్యక్తికి వచ్చిన 'చిన్న వ్యాధి' కూడ మరణము కలిగించవచ్చును. అందుకే.... ఈ వ్యాధిని "అంతిమ వ్యాధి" అని అభిప్రాయ పడుతున్నారు. ఈ వ్యాధి వచ్చిన వారికి చికిత్స లేదు. మందులు లేవు రాకుండా ముందు జాగ్రత్త చర్యలు తీసికొనుట ఒక్కటే మార్గము!

## ఎయిడ్స్ రాకుండా జాగ్రత్తలు

1) ఒక్కరితోనే లైంగిక సంపర్కము కలిగియుండుట; 2) లైంగిక సంబంధాలలో తప్పని సరిగా 'నిరోధ్' ఉపయోగించుట; 3) H. I. V. వైరస్ లేదని నిర్ధారించిన రక్తాన్నే ఎక్కించుట; 4) బాగా స్టెరిలైజ్ చేసిన సిరంజ్‌లు, సూదులు ఉపయోగించుట; ఇవి ఒకరికి వాడినవి మరొకరికి వాడక పోవుట వంటి జాగ్రత్తలు తప్పక పాటించాలి. కొంతమంది అనుకొంటున్నట్లు- 1) ఎయిడ్స్ ఉన్నవారితో కలిసి- మెలిసి ఉండుట వలన, 2) ఎయిడ్స్ ఉన్నవారి దుస్తులు, వస్తువులు వాడుట వలన; 3) క్రిమి-కీటకాల ద్వారా; 4) ఎయిడ్స్ రోగిని తాకుట లేక వారికి పరిచర్యలు చేయుట వలన ఈ వ్యాధి రాదు.

2000 సం॥ల నాటికి ప్రపంచములో సుమారు నాలుగు కోట్ల మందికి H .I. V. సోకి.... కనీసము కోటి యాభై లక్షలమంది పూర్తి ఎయిడ్స్ వ్యాధి గ్రస్తులుంటారని W. H. O. అంచనా వేసింది. ఇందులో- ఆసియా ఖండమే ప్రథమ స్థానము వహించ వచ్చునట! 1994, జూన్ నాటికి ఒక కోటి నలభై లక్షల మందికి H. I. V. సోకి బాధపడుతున్నట్లుగా తెలిసినది. దీనివలన భవిష్యత్‌లో 'కుటుంబ వ్యవస్థ' ఛిన్నాభిన్నము కాగలదని హెచ్చరిస్తున్నారు. కాబట్టే.... W. H. O. వారు 1988 నుండి డిసెంబర్-1ని "ఎయిడ్స్ దినము"గా పాటిస్తున్నారు. దీని ముఖ్య ఉద్దేశ్యము- ప్రపంచములోని అన్ని కుటుంబాలవారు వ్యక్తిగతముగా, సమిష్టిగా జాగ్రత్తలు తీసికొని ఎవరి కుటుంబాలను వారే ఎయిడ్స్ బారిన పడకుండా జాగ్రత్త చర్యలను గైకొనాలని!

యీ ఎయిడ్స్ వ్యాధి సోకినవారికి సెల్స్ బలముగా వుండి, వైరస్ క్రిములతో పోరు సలుపుతూనే వుంటే- జీవితాంతము నీరసముగా బ్రతకవచ్చు. మరి కొందరిలో వ్యాధి క్రిములు ప్రవేశించినా "T" సెల్స్ వాటిని నాశనము చేయగల స్థాయిలో వుండి, యీ వ్యాధికి గురికాకుండా చేయవచ్చు. కొందరికి యీ వ్యాధి వున్నా దాని లక్షణాలు పెద్దగా బయటపడవుగాని.... సంపర్కము జరిగినప్పుడు యీ క్రిములు అవతలివారిలో ప్రవేశించి, వారికి ఎయిడ్స్ తీవ్రస్థాయిలో తాకవచ్చు. వీరితో మరొకరు సంపర్కము చేస్తే వారిలోనికి యీ క్రిములు ప్రవేశించి వారిని ఎయిడ్స్‌కి గురి చేస్తాయి.

ఎయిడ్స్ విజృంభించిన వారికి మెడమీద, చంకలలో, గజ్జలలో లింఫ్‌గ్లాండ్స్- బాగా వాచి, రోజుల తరబడి జ్వరము నిలిచిపోతుంది. రాత్రిళ్ళు చెమటలు కారిపోతాయి. ఏ పని చేయలేనంత నీరసముగా వుంటుంది. నీళ్ళ విరేచనాలు ఎక్కువగా ఔతూ వుంటాయి. బాగా బరువు తగ్గి, శరీరము శుష్కించి, కొన్నాళ్ళకు దేహాన్ని చాలిస్తారు.

ఆ మధ్య ఒక సంతోషకరమైన వార్తను వైద్య శాస్త్రజ్ఞులు ప్రకటించారు. "త్వరలో ఎయిడ్స్ వ్యాధి క్రిములను కంట్రోల్ మాత్రమే చేయుటకు వీలు కలుగుతుంద"ని, "శాశ్వత నిర్మూలనకు ఇంకా విస్తృత పరిశోధనలు ప్రపంచ వ్యాప్తముగా జరగాల"ని! వారి కృషి ఫలించాలని ఆశిస్తూ.... ఎదురు చూచుట తప్ప మనము చేయ గలిగినది ఏమీలేదు.

# ఇంగ్లీష్ మందులతో గృహవైద్యము

వైద్యులు అందుబాటులోలేని కొన్ని గ్రామసీమల వారికి చిన్న చిన్న వ్యాధులకు- వాడు వాడుకోవడానికి వీలుగా కొన్ని మందుల పేర్లు, అవి ఏ ఏ వ్యాధులకు వాడుకోవలసినది- యీ క్రింద వివరించ టము జరిగినది. (సౌలభ్యము కోసము బిళ్ళల పేర్లు వరుసగా "తెలు గు"లో వ్రాసి, ఆ తరువాత వరసలో అవే బిళ్ళల పేర్లను- అదే వరుస క్రమములో "ఇంగ్లీష్"లో వ్రాయడమైనది.)

1) సాధారణముగా అందరికీ ఎక్కువగావచ్చేవి జలుబు, పడిసెము,

ఒళ్ళునొప్పులు. వీటికి "పారాసెటమాల్" మరియు ఇతర కాంబినేషన్లతో కొన్ని బిళ్ళలను యీ క్రింద సూచించుట జరిగినది. డోస్ 2 బిళ్ళలు; 5 సం॥లు పైబడిన పిల్లలకు అర బిళ్ళ చొ॥ జాగ్రత్తగా వాడాలి.

1) క్రోసిన్; 2) మెటాసిన్; 3) మెటాసిన్ డ్రాప్స్ [ఇది పసిపిల్లలకు]; 4) కోల్డాక్ట్; 5) కోల్డారిన్

1) Crocin, 2) Metacin, 3) Metacin Drops, 4) Coldact, 5) Coldarin.

2] వాతావరణ మార్పు వలన ఎక్కువ మందికి పడిసెము పట్టి ముక్కునుండి నీరు కారుట, ముక్కు దురద, ముక్కు దిబ్బడ, రొంప లాంటివి వస్తుంటాయి. ముక్కులో వేయు చుక్కల మందులను, బిళ్ళలను యీ క్రింద సూచించడమైనది.

1) నాసనాల్; 2) బెట్నెసాల్-ఎన్; 3) ఫెనాక్స్‌నాసల్ చుక్కల మందులు మరియు 1) కోసావిల్; 2) కోల్డారిన్; 3) సినారిల్; 4) డ్రిస్టాన్; 5) ఫోరిస్టాల్; 6) ఎవిల్-బిళ్ళలు.

1) Nasanal, 2) Betnesol-N, 3) Fenoxnasal- Drops and 1) Cosavil, 2) Coldarin, 3) Cinaryl, 4) Dristan, 5) Foristal, 6) Avil-Tablets.

3] చెవిలో నొప్పి, చెవిలో పుల్లలుపెట్టి త్రిప్పినప్పుడు వచ్చే పోటు, చెవిలో చీము కారుటకు యీ క్రింది చుక్కల మందులను వాడవచ్చును.

1) వైసోనోల్-సల్ఫా, 2) బెట్నెసాల్-ఎన్, 3) ఓటెక్, 4) ఆరినాల్, 1) Wysonol-sulpha, 2) Betnesol-N, 3 Otek, 4) Aurinol వీటితో పాటు యాంటిబయాటిక్స్ కూడా వాడవలసి ఉంటుంది. ఉదా॥ : Tetracycline, Sulpha, Peniceiline etc.

4] కొందరికి కంటిలో నలకలు, దుమ్ము పడి మంటలు నొప్పులు కలుగుతాయి. కొందరికి కళ్ళు దురదలు, పుసులు కట్టుట, నీళ్ళుకారుట లాంటివి వుంటాయి వారు 74వ పేజీలో తెలిపిన కంటికి ఆయింట్‌మెంట్లను, చుక్కల మందులను జాగ్రత్తగా వాడుకోవచ్చును.

1) సోఫ్రామైసిన్, 2) టెర్రామైసిన్ ఐ ఆయింట్‌మెంట్స్: 1) ఆల్బ్యూసిడ్, 2) ఐడ్రాక్స్, 3) జెంటిసిన్-కంటి చుక్కల మందులు.

1) Soframycin, 2) Terramycin Eye Ointments:
1) Albucid, 2) Eidrox, 3) Genticyn Eye Drops.

5] కొంతమంది స్త్రీలకు ఋతుక్రమములో (బహిష్టు) నొప్పి ఉంటుంది. కొందరికి ఊపిరి కట్టులో నొప్పిగా వుంటుంది. కొందరికి మూత్రాశయము నొప్పిగా వుంటుంది. కొందరికి కడుపు నొప్పిగా ఉంటుంది. అటువంటి వారు ఈ క్రింది "యాంటీస్పాస్మాడిక్స్" బిళ్ళలను జాగ్రత్తగా వాడవచ్చును. [చిన్నపిల్లలకు చుక్కల మందులను సూచించడమైనది] 1) ఎవాఫార్టాన్, 2) బెరాల్‌గన్, 3) స్పాస్‌మిండాన్ 4) బార్‌డేస్ [ఋతుశూలకు] బిళ్ళలు, 1) బెరాల్‌గన్ [పిల్లల కడుపు నొప్పికి] చుక్కల మందులు.

1) Avafortan, 2) Baralgan, 3) Spasmindon, 4) Bardase (For Menses Pain) Tab; 1) Baralgan (For Babies Belly Pain) Drops.

6] కొందరికి చర్మము దురదగా వుంటుంది. అలాగే పుళ్ళు, గజ్జి, కాల్పులు మొదలగు చర్మవ్యాధులలో క్రింది ఆయింట్‌మెంట్స్ వాడవచ్చును. 1) బర్నాల్ [కాల్పులకు], 2) ప్యూరాసిన్, 3) స్కెబిక్స్-ఎస్, 4) ఎస్కామెల్ ఆయింట్‌మెంట్స్.

1) Burnol (For Burns), 2) Furacin, 3) Scebex-S,
4) Eskamel Ointments.

7] కొందరు విరేచనాలు అగుటకు ఆముదము త్రాగుతారు. మరికొందరు వివిధ రకాల నాటుమందులు వాడుతారు. విరేచనాలు అగుటకు నాటుమందులు తీసుకోవడము అంత మంచిది కాదని వైద్యులు అంటున్నారు. మోషన్స్ కావాలనుకునేవారు ఈ క్రింది మందులను వాడుకోవచ్చును. 1) పర్సోనిడ్, 2) బై-కోలేట్స్, 3) డల్‌కోలాక్స్.
1) Pursonnid, 2) Bi-Colates, 3) Dulcolax.

8] తిన్న ఆహారము కొన్ని కొన్ని సందర్భములలో అంటే అమితముగా తినుట, అఱుగనివి తినుట లాంటివి చేసినప్పుడు ఈ క్రింది మందులను వాడిన త్వరగా జీర్ణమగును.

1) యూనిఎంజైమ్, 2) డైజీప్లెక్స్ టానిక్, 3) లివ్-52

1) Unienzyme, 2) Digeplex-Tonic, 3) Liv-52.

9] నిల్వవున్న ఆహారపదార్థములు తిన్నప్పుడు, మఱియు సరి పడని ఆహార పదార్థములు తిన్నప్పుడు- వాంతులు: కడుపులో వికారముతో వాంతులు బొతున్నట్లుగా ఉండేవారు ఈ క్రింది మందులను వాడవచ్చును. 1) ఫెనర్గాన్, 2) పెరినార్మ్ బిళ్ళలు-ఇంజక్షన్లు, 3) యాంపిసిలిన్ (యాంటీబయాటిక్స్).

1) phenergan, 2) Perinarm, 3) Amplcillin (Antibiotics).

10] కొందఱికి వాతము వలన అనేక రకాలుగా శరీరములో వివిధ భాగాలలో నొప్పులు వస్తాయి. అటువంటి అన్ని రకాల వాత నొప్పులకు, వాపులకు ఈ క్రింది మందులను వాడవచ్చును.

1) ప్రోక్సివాన్, 2) ఐబూబిడ్-టి-ఆర్, 3) అనాల్జిన్, 4) వోవెరాన్

1) Proxyvon, 2) Ibubld-T-R, 3) Analgin, 4) Voveran.

11] కొందఱికి అజీర్తి చేసి-పుల్లని త్రేపులు, కడుపులో మంట, నొప్పి వస్తాయి. అటువంటి వారు యీ క్రింది మందులను వాడవచ్చును.

1) జెలుసిల్, 2) పి.హెచ్-4, 3) లోగాసిడ్, 4) డైజిన్.

1) Gelusil, 2) P.H-4, 3) Logascid, 4) Digine.

12] సాధారణముగా వచ్చే తలనొప్పి, పంటినొప్పి, అలసినప్పుడు వచ్చే ఒంటి నొప్పులు, కడుపు నొప్పి, చెవి నొప్పులకు యీ క్రింది మందులు వాడవచ్చును.

1) సారిడాన్, 2) నొవాల్జిన్, 3) అనాల్జిన్, 4) వెగాపిన్, 5) క్రోసిన్, 6) కోడోఫైరిన్, 7) అస్ప్రిన్, 8) క్రోట్రాల్.

1) Saridon, 2) Novalgin, 3) Analgin, 4) Veganine, 5) Crocin, 6) Codopyrine, 7) Asppirin, 8) Codral.

పై మందులన్నీ కూడా అత్యవసర పరిస్థితులలో వైద్య సహాయము అందేవరకు వాడి- అసలు వ్యాధి ఏ కారణముగా వచ్చెనో.... పట్టభద్రులైన వైద్యులను సంప్రదించి, తగు పరీక్షలు జరిపి, దాని కను వగు చికిత్స-మందులు వాడి శాశ్వత నివారణ పొందవలెను.

## సర్వ సామాన్యమైన వ్యాధులు - మందులు

తలనొప్పి = సారిడాన్ (Saridon), అనాల్జిన్ (Analgin)

కడుపునొప్పి = బెరాల్గన్ (Baralgon), అవాఫోర్టాన్ (Avafortan)

బహిష్టునొప్పి = బెరాల్గన్ (Baralgon), డిహైడర్గాట్ (Dihydergot)

మైగ్రేన్ = ఎన్సెఫాబాల్ (Encephabal), అవాఫోర్టాన్

పార్శ్వనొప్పి = ఆస్ప్రిన్ (Aspirin), అనాల్జిన్ (Analgin)

జ్వరము = క్రోసిన్ (Crocin), మెటాసిన్ (Metacin)

కడుపుమంట = జెలుసిల్ (Gelucil) డైజిన్ (Digene)

వాంతులు = స్టెమెటిల్ (Stemetyl), అవోమిన్ (Avomine)

జలుబు = రెఫగాన్ (Refagan), కోల్డారిన్ (Coldarin)

చెవిపోటు = అరినాల్ (Anrinol), ఓటెక్ (Otek) చెవిచుక్కల మందులు

కాల్పులు = బర్నాల్ (Burnol), ఫ్యూరాసిన్ (Furacin) ఆయింట్మెంట్స్

తామర, సోబి = టినాడెర్మ్ (Tenaderm), డెరోబిన్ (Derobin)

దద్దుర్లు = ఎవిల్ (Avil), యాంటిస్టిన్ (Antistine)

ఛాతీనొప్పి = అనాల్జెసిక్స్ (Analgesics), ప్రోక్సివాన్ (Proxivon)

కంటిమంట = బెట్నెసాల్-ఎన్ (Betnesol-N) బిడ్రెక్స్ (Bidrex), కంటి డ్రాప్స్ (Eye Drops)
వాపునొప్పులు = బ్రూఫిన్ (Brufin), బుటాజోల్డిన్ (Butazoldin)
నిద్రలేమి = నైట్రావిట్ (Nitravit) వాలియమ్ (Valium)
ఆకలిలేమి = ఫెస్టాల్ (Festal), యూనిఎంజైమ్ (Unienzyme)
శ్రీం తెలుపు = హయాసిన్ (Hyacin), ఫ్లాజిల్ (Flagyl).

పై మందులన్నీ కూడా సాధ్యమయినంత వరకు వైద్య సలహా ననుసరించే వాడవలయును. పైన తెలిపిన సర్వ సామాన్యమైన జబ్బులకు దరిదాపుగా అందరూ ఏదో ఒక సమయములో గురై ఉంటారు. ఒక జబ్బు పదేపదే వస్తూ ఉంటే.... వచ్చినవారు ప్రతిసారి ఏదో ఒక మందును తీసుకోకుండా.... మంచి క్వాలిఫైడ్ డాక్టర్స్‌ను సంప్రదించి, తగిన చికిత్స చేయించుకోవాలని మరొకసారి విజ్ఞులైన పాఠకులను కోరుచున్నాము.

# ప్రమాదములు - ప్రథమ చికిత్స

మానవుడు మేధస్సుతో- గ్రహాంతరాలను విజ్ఞాన రహస్యాలను ఎంత త్వరితముగా శోధించాడో.... అంతకుమించి ప్రమాదాలకు కూడా గురి ఔతున్నాడని చెప్పవచ్చును (ఉదా॥ : వాహన ప్రమాదములు, నీటి ప్రమాదములు, అగ్ని ప్రమాదములు, విష (వాయు) పదార్థముల ప్రమాదములు మొ॥నవి) ఎంత జాగ్రత్త వహించినా అదుపులేని జనాభావలన ప్రమాదములు అతి ఎక్కువగా జరుగుచున్నవి. జరిగిన వెంటనే చేయవలసిన చికిత్సనే "ప్రథమ చికిత్స" అంటారు. ప్రథమ చికిత్స జరుగక పోవుటవలన అతి స్వల్ప ప్రమాదాలు కూడా కొన్ని సందర్భాలలో ప్రాణాంతకమైన ఎన్నో కేసులు మనము ఏదో ఒక సమయములో గమనించే ఉంటాము. (ఉదా॥ : ప్రమాదవశాత్తు ఏ చేతిమీద నరము తెగి- రక్త స్రావము ఔతున్నదనుకొండి! రక్త స్రావాన్ని అరికట్టకుండా చికిత్స నిమిత్తమై ఏ హాస్పటల్‌కో వెళ్ళేలోపు

రక్తమంతా కారిపోయి, ప్రాణాలు పోగొట్టుకున్నవారు చాలమంది ఉన్నారు) అందుకే ప్రథమ చికిత్సా విధానాలను ప్రతి ఒక్కరు తెలిసి కొని ఉండుట చాల అవసరము!

## జ్వరము (TEMPERATURE)

శరీరము అవిశ్రాంతముగా శ్రమించిన సందర్భాలలో జ్వరము వస్తుంది. జ్వరము వచ్చినపుడు బట్టలు లూజ్ చేసి, ముఖ్యముగా మంచి గాలి వచ్చే ప్రదేశములో పడుకోబెట్టి- ఐస్ నీళ్ళలోగానీ, చల్లటి నీళ్ళలో గాని గుడ్డ తడిపి, ఒళ్ళంతా తుడిచి, చల్లని తడిగుడ్డను నుదురుమీద వేసికోవలెను. అవసరమయితే ఒక క్రోసిన్ (Crocin) బిళ్ళ కాఫీతో గాని, పాలతోగాని వేసికొని విశ్రాంతిగా పడుకొనవలెను.

## ప్రమాదము వలన రక్తస్రావము

ప్రమాదవశాత్తు గాయమై, రక్తస్రావము జరుగుచున్న ప్రదేశములో- నీటిలో గుడ్డ తడిపి, గాయాన్ని శుభ్రముగా తుడిచి, తడిగుడ్డతో కట్టి, వెంటనే చికిత్సాలయమునకు తీసికెళ్ళి తగిన వైద్యము చేయించాలి.

## ఎముకలు విఱుగుట (FRACTURES)

ఏ కారణము చేతనయినా సరే.... ఏ ఎముక విఱిగినప్పటికి, బాధిత వ్యక్తిని కదలనివ్వకూడదు. ముఖ్యముగా ఎముక విఱిగిన స్థానాన్ని అసలు కదలనివ్వకూడదు. విఱిగిన స్థానము కాలో, చెయ్యో ఐతే.... వాటిని కదలకుండా వెదురు బద్దలతోనో, మందపాటి అట్టల తోనో కట్టి- ఎముకల వైద్యుని వద్దకు తీసికెళ్ళి చికిత్స చేయించాలి.

## నీటిలో మునుగుట

ప్రమాదవశాత్తు నీటిలో పడినవారు గాలికి బదులు నీటిని పీలుస్తారు. ఈ దశలో నీరు- ఊపిరితిత్తులు, అన్నవాహికలో ప్రవేశించి మనిషి ఉక్కిరి బిక్కిరై స్పృహ కోల్పోయి ప్రాణము పోవును. నీటిలో

పడిన తరువాత పైకి తీసిన స్పృహలేని వ్యక్తికి ఈ క్రింది విధముగా చికిత్స చేయించాలి.

1) తలకంటే కాళ్ళు ఎత్తు (అంటే ఏటవాలుగా)లో ఉండేలా పడుకోబెట్టాలి. 2) త్రాగిన నీరు బయటకు వచ్చేలా పొట్ట ఒత్తాలి. 3) నోరును తెలచి పట్టుకొని, నీరు బయటకు వెళ్ళటానికి వీలుగా ఉంచాలి. 4) నీరు మొత్తము బయటకు వెళ్ళినా ఊపిరి అందని వారికి "ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్" ద్వారా శ్వాస అందించాలి. 5) స్పృహ రాగానే వేడి కాఫీగానీ, పాలుగానీ ఇచ్చి- అవసరమనుకొంటే వైద్యునికి చూపించాలి.

## అగ్ని ప్రమాదములు

ప్రమాదవశాత్తు బట్టలకు మంటలు వ్యాపించినపుడు పరుగెత్తకుండా క్రిందపడి దొర్లటము లేక మందపాటి దుప్పటి లాంటిదాన్ని ఒకటి మీదవేసి చుట్టటముచేసి మంటలు ఆర్పవలెను. కాలి గాయమైన ప్రదేశాలలో 'బర్నాల్' గాని, 'వాజ్‌లైన్'గాని రాసి- గాలి బాగా సోకే ప్రదేశాలలో ఉంచాలి. మంటగా ఉంటే "అనాల్‌జిన్" బిళ్ళ వేయాలి. గాయాలు తీవ్రముగా ఉంటే పై విధానములతో ప్రథమ చికిత్సచేసి వైద్యశాలకు గొనిపోయి చికిత్స చేయించాలి.

## విష పదార్థములు సేవించుటచే ప్రమాదములు

పిల్లలుగాని, పెద్దలుగాని.... నల్లులు, ఎలుకల మందులు లాంటివి సేవించినచో ఆ మందులను వెంటనే కక్కించాలి.

1) ఉప్పు బాగా కలిపిన నీటిని ఎక్కువగా త్రాగించిన వాంతి అగును. 2) అంగిటిలోనికి వ్రేళ్ళు పోనిచ్చినను వాంతి అగును. 3) పాలు, కోడిగ్రుడ్డు సొన కలిపి త్రాగించినా మంచిదే!

పై విధముగా రెండు-మూడుసార్లు వాంతి చేయించి, వెంటనే వైద్యుని పర్యవేక్షణకు తీసుకువెళ్ళి, తగిన చికిత్స చేయించవలెను.

## పాముకాటు

1) విషసర్పపు కాటుకు గురైన వ్యక్తిని గాలి-వెలుతురు వచ్చే శుభ్రమైన ప్రదేశములో పరుండబెట్టాలి. 2) కాటుబడిన ప్రదేశానికి

రెండు అంగుళాల దూరములో పై భాగాన గుడ్డతోగాని, తాడుతోగా గట్టిగా కట్టాలి. 3) పాముకాటును బ్లేడ్‌తో కొంచెము పెద్దదిచేసి నోటిలో పుళ్ళు-వ్యాధులు లేనివారు- నోటితో గాయాన్నుండి స్రావాన్ని పీల్చి ఉమ్మి వేయాలి. ఇలా నాలుగైదుసార్లు చేయాలి. (స్రావాన్ని ఏమాత్రము మింగకూడదు) 4) తరువాత దగ్గరలో ఉన్న పెద్ద వైద్యశాలకు తీసికెళ్ళే ప్రయాణములో ప్రతి 4–5 నిమిషాల కొకసారి పాము కాటుకు పై భాగాన కట్టిన గుడ్డను లూజ్‌చేసి, మరలా బిగిస్తూ ఉండాలి.

## మండ్రగబ్బ, జెర్రి, తేలుకాట్లు

1) వీటి కాటుకు పై భాగములో గుడ్డగాని, రబ్బర్‌తోగాని కట్టు కట్టి, కదలకుండా ఉంచి, వైద్యుని పిలిపించి తగిన వైద్యము చేయించాలి 2) తేలుకాటుపై ఐస్ ముక్క ఉంచినచో- విషము పైకి ఎక్కదు. 3) కుట్టినచోట ఉల్లిపాయతో గాని, పొగాకుతోగాని రుద్దితే బాధ ఉపశమించును

## కరెంట్ షాక్

1) ఎలక్ట్రిక్ షాక్‌కి గురైన వారికి– ఉద్రేకము కలిగించే పదార్థములను ఇవ్వాలి. 2) సాగిలా పరుండబెట్టాలి. 3) షాక్ తిన్నవారికి ప్రథమ చికిత్స చేయునపుడు సాధ్యమైనంతవరకు చేతులకు తడి ఉండకూడదు. కాలికి చెప్పులుండాలి. సందర్భాన్ని బట్టి "ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్" ఇవ్వాలి. ప్రమాదము తీవ్రముగా ఉంటే వైద్యశాలకు గొనిపోయి, వెంటనే తగిన చికిత్స చేయవలెను.

## వడదెబ్బ

1) వడదెబ్బ తగిలినవారికి– వెంటనే బట్టలన్నీ వదులుచేసి మంచి గాలి తగిలే ప్రదేశానికి తరలించాలి. 2) తల, మెడ, రొమ్ము, వెన్నెముకల మీద చల్లని నీటిని పొయ్యాలి. 3) తగుమాత్రము ఉప్పు కలిపిన చల్లటి నీటిని తాగించాలి అవకాశముంటే పండ్లరసము, కొబ్బరినీరు, గ్లూకోజ్, మజ్జిగ కూడా ఇవ్వవచ్చును. పరిస్థితి తీవ్రముగా ఉంటే.... వెంటనే అందుబాటులోని వైద్యాలయానికి తరలించాలి.

—*—

# విశేష 'ప్రజాదరణ' పొందిన మా ప్రచురణలు

'జ్యోతిషాగమ వాస్తు పండిట్'

**1. సత్యనారాయణ సిద్ధాన్తి గారి...**

| | |
|---|---|
| వాస్తు శాస్త్రము | 20/- |
| వాస్తు యంత్ర రత్నావళి | 24/- |
| గృహ వాస్తు చంద్రిక | 18/- |
| గృహ వాస్తు సారము | 15/- |
| జ్యోతిష శాస్త్రము | 25/- |
| దత్తాత్రేయ తంత్ర విద్య | 24/- |
| 'పతంజలి' యోగ సాధన | 15/- |
| కుండలినీ శక్తి | 15/- |
| మంత్ర శక్తి | 15/- |
| గోచార గ్రహ ఫలితాలు | 12/- |
| అష్ట నాగ పూజ | 10/- |
| స్తోత్ర రత్నమాల | 12/- |
| అందానికి మార్గాలు | 10/- |
| అంగ సాముద్రిక శాస్త్రము | 15/- |
| హౌస్ ప్లాన్స్ | 20/- |
| ఇంద్రజాల రహస్యాలు | 10/- |
| మహేంద్రజాలం | 10/- |
| సంధ్యావందనము | 15/- |
| అన్ని రాశుల వారికి ఫలితాలు | 6/- |
| విడి రాశులు | రాశి 1కి 4/- |
| జననకాల ఫలదీపిక | 15/- |
| సంఖ్యా ఫలితాలు | 6/- |
| జాతక చక్రము వేయడమెలా? | 20/- |

**S. గంగారామ్, MA గారి ..**

డెస్క్ వర్క్ ఇంగ్లీష్ గ్రామర్

| | |
|---|---|
| ★ పార్ట్-I "పార్ట్స్ ఆఫ్ స్పీచ్" | 15/- |
| ★ పార్ట్-II "టెన్స్" | 15/- |

'కవిశ్రీ' **D. ఆదినారాయణ రావు గారి...**

| | |
|---|---|
| చిన్నారి పేర్లు | 20/- |
| చిట్కా వైద్యం | 16/- |
| చిట్కా వైద్యం-2 | 18/- |
| తెలుగు సామెతలు - సూక్తులు | 16/- |
| 555 జాలీ జోక్స్ | 15/- |
| స్త్రీలకు చిట్కాలు | 16/- |

'భాషా ప్రవీణ' **రాయప్రోలు రథాంగపాణి గారి...**

| | |
|---|---|
| గృహవాస్తు దర్పణం | 12/- |
| తెలుగు వ్యాకరణము | 15/- |
| షిర్డి సాయినాథ చరిత్ర (పారాయణ గ్రంథము) | 18/- |
| హనుమద్వైభవము (పారాయణ గ్రంథము) | 18/- |
| హనుమద్విజయము | 20/- |
| తెలుగు - వెలుగు | 18/- |
| మానవ "ధర్మ శాస్త్రం" | 15/- |
| స్తోత్ర ప్రభాకరము | 15/- |
| హాస్య కథలు | 12/- |
| భారతీయ కామకళా శాస్త్రము | 16/- |

'రాష్ట్ర భాషా ప్రవీణ' **"శ్రీ చిత్ర" పురాణపండ గారి...**

| | |
|---|---|
| శ్రీ మహాలక్ష్మి నిత్య పూజ | 6/- |
| దాంపత్య కామకేళి | 15/- |
| ఆయుర్వేదమ్ | 18/- |
| అనుదిన ధర్మాలు | 15/- |
| నామ జపం - జపఫలం | 6 - |
| నిత్యానుష్ఠాన సంపుటి | 15 - |
| ★ కలియుగదైవం-కల్యాణ ఘట్టాలు | 15 - |

**L. రత్నాజీ, సూర్యకుమార్, K.S.N. మూర్తి, వేగుంట జ్యోతి గార్ల**

| | |
|---|---|
| డబ్బేనా ..! మీకు కావలసినది ? | 16/- |
| 48 స్టెప్స్ To సక్సెస్ | 20/- |
| పరీక్షలలో ఫస్ట్ క్లాస్ మీదే | 16 |
| బ్యూటీ గైడ్ | 20 - |

**★ స్టార్ మార్క్ ఉన్నవి స్టాక్‌లో లేవు. స్టార్ మార్క్ లేనివి మాత్రమే స్టాక్‌లో ఉన్నవి.**

Cont 4th Cover